(✓) : The elephant was wounded *by* him *with* a dagger.

7] (×) : This Church was designed with Alexander.
(✓) : This Church was designed *by* Alexander.

8] (×) : We write by a pen.
(✓) : We write *with* a pen.

9] (×) : The hunter killed the bird by an arrow.
(✓) : The hunter killed the bird *with* an arrow.

10] (×) : The headmaster beat the student by a stick.
(✓) : The headmaster beat the student *with* a stick

**EXERCISE – 7 :** *Correct the following sentences if necessory !*

1] He cut the tree by an axe (గొడ్డలితో నరికెను).
2] She was stabbed by a rowdi by a knife (కత్తిచే).
3] She was struck by a stone (రాయితో).
4] The Police was attacked with the mob (జన సమూహముతో).
5] He was struck with his enemy with a long stick (పొడవైన కఱ్ఱతో).
6] She cut it with a knife (కత్తితో కోసెను).
7] Mr. Thomas is highly respected by his associates (సహచరులచేత).
8] The book I am reading was written by a famous philosopher (ప్రఖ్యాత వేదాంతిచే).
9] He was fairly treated by me (నా చేత).
10] This letter was written with me by a ballpen (బాల్ పెన్ చే నాతో).

**WORK SHEET** : పై అభ్యాసములోని వాక్యములను- అవసరమైనచో.... సరిచేసి, చిత్తు పుస్తకములో వ్రాసికొని, జవాబులను- ఈ పుస్తకము చివర ఇచ్చిన 'KEY' నందు సరిచూచుకొని వాక్యమునకు 1 మార్కు చొప్పున వేసికోండి ! Marks : [ ]

## Example No. : 20

Neither Alexander nor his wife were invited to this party. (×)

Neither Alexander nor his wife *was* invited to this party. (✓)

సరిదిద్దిన దోషము : పైన ఇవ్వబడిన వాక్యము నందు verb యొక్క numberలో దోషము వున్నది. వాక్యములోని Subject (కర్త) ఏ numberలో అయితే వుంటుందో.... verb కూడా అదే number (వచనము)లో వుండాలి. పైన ఇవ్వబడిన వాక్యములోని Subject- Singular number (ఏక వచనము)లో వున్నది. Verb- plural number (బహు వచనము) (were)లో వున్నది. కనుక.... 'were'ను "*was*"గా మార్చబడమైనది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Verb (number).

**వివరణ (Explanation)** : ఈ వాక్యములో ఉపయోగించబడిన Neither....nor అనేది ఒక Conjunction (కలిపే పదము) ! ఇలాంటి conjunctionనకు "Co-ordinating conjunction" అని పేరు ! ! ఏక వచనములో నున్న రెండు Nouns (నామ వాచకములు)ను గాని లేదా pronounsను గాని, co-ordinating conjunctions అయిన either....orతో గాని లేదా Neither....norతో గాని కలుపబడి యున్నచో.... ఆ వాక్యము నందలి verb కూడా తప్పనిసరిగా ఏకవచనములోనే వుండాలి. అలాగాక వాక్యములోని రెండు Subjects....

either....orతో కలిసిగాని, Neither....norతోగాని కలిసియున్నపుడు-verbనకు అతి దగ్గఱగా వున్న Subject యొక్క number ను బట్టి verb యొక్క number ఆధారపడి యుంటుంది. అనగా.... ఇలాంటి వాక్యములో ఇచ్చిన రెండు Subjectsలో మొదటి subject సాధారణముగా Singular numberలోను, రెండవ Subject సాధారణముగా plural numberలోను వుంటుంది.

సంక్షిప్త వివరణ : 1] Either *David* or *his wife* was invited

2] Either *David* or *his friends* were invited.

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : Either you or I are guilty.
(✓) : Either you or I *am* guilty.

2] (×) : Either this fellow nor you stole my purse.
(✓) : Either this fellow *or* you stole my purse.

3] (×) : Either my uncle or my aunt are likely to come.
(✓) : Either my uncle or my aunt *is* likely to come.

4] (×) : Either my uncle or his sons is likely to come.
(✓) : Either my uncle or his sons *are* likely to come.

5] (×) : Either David or his brother have stolen the book.
(✓) : Either David or his brother *has* stolen the book.

6] (×) : Either the students or I is likely to come.
(✓) : Either the students or I *am* likely to come.

7] (×) : Either Margaret or her sisters has done the work.
(✓) : Either Margaret or her sisters *have* done the work.

8] (×) : Either her sisters or Margaret have done the work
(✓) : Either her sisters or Margaret *has* done the work.

9] (×) : Either he or she have finished the work.
(✓) : Either he or she *has* finished the work.

10] (×) : Either an ambulance or a car take patients to the hospital.
(✓) : Either an ambulance or a car *takes* patients to the hospital.

11] (×) : Neither David nor Daniel have done this
(✓) : Neither David nor Daniel *has* done this.

12] (×) : Neither a car nor an ambulance were provided for him.
(✓) : Neither a car nor an ambulance *was* provided for him.

13] (×) : Neither Joseph nor Mary were shivering with fever.
(✓) : Neither Joseph nor Mary *was* shivering with fever.

14] (×) : Neither George nor William are going.
(✓) : Neither George nor William *is* going.

15] (×) : Neither my mother nor my wife have finished the work.
(✓) : Neither my mother nor my wife *has* finished the work.

**EXERCISE - 8** : *Correct the following sentences if necessary :*

1] Either she or I is at fault.
2] Either the architect or the builders was to blame.
3] Neither the master nor his servents is guilty.
4] Either she or I am mistaken.
5] Neither she or her sisters has come.
6] Neither he or his father are in the house.
7] Either she or her brother has done this work.
8] Neither Joseph nor his friends has taken my pen.
9] Either she or her sisters are going to the market.
10] Neither David nor his sister has drawn the picture.

**WORK SHEET :** పై అభ్యాసములోని వాక్యములను- అవసరమైనచో.... సరిచేసి, చిత్తు పుస్తకములో వ్రాసికొని, జవాబులను- ఈ పుస్తకము చివర ఇచ్చిన 'KEY'నందు సరిచూచుకొని, వాక్యమునకు 1 మార్కు చొప్పున వేసికోండి ! Marks : [ ]

## Example No. : 21

You should take legal advise. (×)
You should take legal *advice*. (✓)

సరిదిద్దిన దోషము : పైన ఇచ్చిన వాక్యములో verb-noun నకు సంబంధించిన దోషము గలదు. advise అనేది verb. ఇచట అనగా ఈ వాక్యములో verb (క్రియ)ను ఉపయోగించుట తగదు. దీనికి

బదులుగా "*advice*" అను noun (నామ వాచకము)ను మాత్రమే ఉపయోగించవలసి ఉంటుంది. కనుక.... "advise (సలహానిచ్చు, సలహా చెప్పు)" అను verb ఉన్న స్థానములో- "advice (సలహా)" అను Nounను ఉపయోగించుట జరిగినది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? verb-noun.

వివరణ : పై వాక్యములో ఉపయోగించబడిన మాటలు advise, adviceలు దాదాపు ఒకే రకముగా ఉన్నాయి. ఉచ్చారణ (pronounciation)లోను (ఎడ్వైజ్, ఎడ్వైస్); Spelling (అక్షరముల అమరిక)లోను (advise, advice) ఈ రెండు పదములు ధాదాపు ఒకే విధముగా ఉన్నాయి గనుక.... తికమకపడే అవకాశము వున్నది. "Advise (ఎడ్వైజ్ = సలహానిచ్చు, సలహా చెప్పు)" అనే పదము verb (క్రియ) అవుతుంది. advice "(ఎడ్వైస్=సలహా)" అనే పదము Noun (నామ వాచకము) అవుతుంది. కనుక.... ఈ రెంటిలో ఏ పదమును verbగా ఉపయోగించాలో, ఏ పదమును Nounగా ఉపయోగించాలో గ్రహించవలెను. ఇచ్చిన వాక్యములో legal advise/legal advice లలో, ఏది సరిపోతుంది? legal (న్యాయ) advise (సలహా చెప్పు) legal (న్యాయ) advice సలహా ! దీనిని బట్టి.... "legal advice (న్యాయ-సలహా)" అనేది సరిపోతుందని గ్రహించవచ్చును.

**కొన్ని మాదిరి వాక్యములు :**

1] (×) : My advise to you is to try again.
(✓) : My *advice* to you is to try again.

2] (×) : What do you advice me to do ?
(✓) : What do you *advise* me to do ?

3] (×) : You won't get good health unless you follow my advise.
(✓) : You won't get good health unless you follow my *advice*.

4] (×) : I advice you to keep quiet.
(√) : I *advise* you to keep quiet.

5] (×) : Who is the best person to advice me on this question ?
(√) : Who is the best person to *advise* me on this question ?

6] (×) : My father advice her to be careful.
(√) : My father *advise* her to be careful.

7] (×) : She want my advise.
(√) : She want my *advice*.

8] (×) : I gave her a piece of advise on this.
(√) I gave her a piece of *advice* on this.

9] (×) : I advice you not to go there.
(√) : I *advise* you not to go there.

10] (×) : My sincere advise to you is try again.
(√) : My sincere *advice* to you is try again.

## Example No. : 22

The hunger makes us weak. (×)
Hunger makes us weak. (√)

సరిదిద్దిన దోషము : ఈ వాక్యము నందు Articlesనకు సంబంధించిన దోషము గలదు. ఈ వాక్యములో Subjectగా నున్న "The hunger" అనే phraseలో- "hunger" అనగా.... ఆకలి ! ఇది Abstract Noun (గుణ నామ వాచకము) ! దీని ముందున్న "The" అను Definite article ను తొలగించిన.... వాక్యము దోష రహిత మగును.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Articles (zero).

వివరణ : ఈ వాక్యములో Articlesనకు సంబంధించిన దోష మున్నది. సాధారణముగా Abstract noun (గుణ నామవాచకము) ముందు- articleను ఉపయోగించరాదు. Adjectiveని లేదా Abstract nounను- Collective noun (సమూహ నామ వాచకము)గా మార్చు టకు "The" అను articleను ఉపయోగిస్తారు.

| *As an Abstract noun* (గుణ నామ వాచకముగా) | *As a Collective noun* (సమూహ నామ వాచకముగా) |
|---|---|
| Poor=బీదదైన, దరిద్ర | *The* poor=బీదవారు, దరిద్రులు |
| rich=ధనిక, భాగ్యవంతమైన | *The* rich=ధనికులు, భాగ్యవంతులు |
| blind=గ్రుడ్డియైన, అంధ | *The* blind=గ్రుడ్డివారు, అంధులు |
| dumb=మూగ, మాట్లాడలేని | *The* dumb=మూగవారు, మాట్లాడ లేనివారు |
| honesty=నిజాయతీ | *The* honesty=నిజాయతీ గలవారు |
| beauty=అందము | *The* beauty=అందమైనవారు |
| sleep=నిద్ర | *The* sleep=నిద్రపోతున్నవారు |
| truth=నిజము | *The* truth=నిజాయతీపరులు |

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : The honesty is the best policy.
(✓) : Honesty is the best policy.

2] (×) : The Justice is a noble quality.
(✓) : Justice is a noble quality.

3] (×) : The beauty is a nine-day's wonder.
(✓) : Beauty is a nine-day's wonder.

4] (×) : The poverty teaches us a lot.
(✓) : Poverty teaches us a lot.

5] (×) : The honesty pays in the long run.
(✓) : Honesty pays in the long run.

## Example No. : 23

She is suffering from fever for seven days. (×)
She *has been suffering* from fever for seven days. (✓)

సరిదిద్దిన దోషము : ఈ వాక్యము నందు verb (క్రియ) యొక్క tense (కాలము) నందు దోషము గలదు. "is suffering" అనే verb (క్రియ) present continuous tenseలో నున్నది. దీనిని present perfect continuous tense లోనికి అనగా "*has been suffering*"గా మార్చిన- పై వాక్యములో దోషము సరిదిద్దినట్లౌతుంది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది? verb-tense.

వివరణ : ఉదాహరణగా ఇచ్చిన వాక్యమునందు verb (క్రియ) యొక్క tense (కాలము) నందు దోషము గలదు. ఈ వాక్యము "period of time (కాల వ్యవధి)"ను గురించి తెలుపుతున్నది. అనగా.... "for seven days" అను phrase కాల వ్యవధి (period of time)ని తెలుపుతున్నది. వాక్యములో period of time (కాల వ్యవధి)ని గాని, point of time (నిర్దిష్ట కాలము)ని గాని తెలుపుతున్నప్పుడు verb (క్రియ) యొక్క tense (కాలము)- present perfect continuousలో ఉండాలి. అంతేగాని.... present Continuous tenseలో ఉండరాదు.

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : She is working since last night.
(✓) : She *has been working* since last night.

2] (×) : The guests are washing their hands for three minutes.

(√) : The guests *have been washing* their hands for three minutes.

3] (×) : My wife is wearing a new saree since 8 A.M.

(√) : My wife *has been wearing* a new saree since 8 A.M.

4] (×) : She is washing clothes since 8 A.M.

(√) : She *has been washing* clothes since 8 A M.

5] (×) : It is raining heavily since down.

(√) : It *has been raining* heavily since down.

**EXERCISE - 9 :** *Correct the following sentences if necessory :*

1] They are waiting for half an hour.
2] I am living here for the last month.
3] We are discussing this matter for many days.
4] I have been reading in this school for two years.
5] I have been waiting for you all morning.
6] My mother is sleeping for six hours now.
7] I am working in the teaching profession since 1988.
8] We are waiting for the bus since Seven O' clock.
9] She has been wearing glasses for seven years.
10] I have been fasting for the last three days.

WORK SHEET : పై అభ్యాసములోని వాక్యములను- అవసరమైనచో.... సరిచేసి, చిత్తు పుస్తకములో వ్రాసికొని, జవాబులను- ఈ పుస్తకము చివర ఇచ్చిన 'KEY' నందు సరిచూచుకొని, వాక్యమునకు 1 మార్కు చొప్పున వేసికోండి.! Marks : [ ]

## Example No. : 24

My brother go to Vijayawada every Saturday. (×)

My brother *goes* to Vijayawada every Saturday. (√)

సరిదిద్దిన దోషము : పై వాక్యము నందు verb (క్రియ) కు సంబంధించిన దోషము గలదు. "go" అను క్రియా పదమును వాక్యము లోని Subjectని బట్టి.... ఇచట "goes"గా మార్చిన- వాక్యములో దోషము తొలగిపోతుంది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? verb - Subject.

వివరణ : పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు- verb (క్రియ)- Subject (కర్త)కు సంబంధించిన దోషము గలదు. Subject- IIIrd person, Singular numberలో ఉన్నపుడు- present Indifinite tense లో నున్న verb నకు "s" అను అక్షరము గాని, "es" అను 'suffix (అంత్య ప్రత్యయము)' గాని లేదా "ies" అను Suffix గాని చేరుతుంది.

మఱువకూడని విషయము : "*Subject*" అనగా కర్త *IIIrd person, Singular number*లో ఉన్నప్పుడు- *Present Indifinite tense*లో నున్న వాక్యము నందలి *verb*నకు '*s*'గాని, '*es*'గాని, '*ies*'గాని చేరుతుంది.

"IIIrd person" అంటే ఏమిటి ? తమను (Ist person : I, we) గురించి గాని; ఎదుటి వారిని (IInd person : you) గురించి. గాని గాక.... ఎక్కడో లేదా ప్రక్కనే ఉన్నవారిని గురించి తెలుపు వదియే.... IIIrd person అవుతుంది.

**Examples :** "He, She, It, They" అను pronouns (సర్వ నామములు) మరియు అన్ని nouns (నామ వాచకములు).

గమనిక : "He, She, it" అను pronouns (సర్వ నామములు) Singular number (ఏకవచనము) లోను, "They" అను సర్వ నామము plural number (బహు వచనము)లోను ఉన్నవి.

| 1st person (ఉత్తమ పురుష) | IInd person (మధ్యమ పురుష) | IIIrd person (ప్రథమ పురుష) |
|---|---|---|
| I see (నేను చూస్తాను) | You see (నీవు చూస్తావు) | He sees (అతడు చూస్తాడు) |
| We see (మేము చూస్తాము) | | She sees (ఆమె చూస్తుంది) |
| | | It sees (అది చూచును) |
| | | John sees (జాన్ చూచును) |

*IIIrd person, Singular number* లో ఉన్న *Subject* నకు తగిన లేదా సరిపడు *Verbs* కొన్ని :

1] take*s* (తీసికొను)
2] carr*ies* (మోయు)
3] go*es* (వెళ్ళు)
4] contain*s* (కలిగియుండు)
5] win*s* (గెలుచు)
6] tell*s* (చెప్పు)
7] abolishe*s* (ఎత్తివేయు)
8] appear*s* (కనిపించు)
9] belong*s* (చెందు)
10] clean*s* (శుద్ధిచేయు)
11] connect*s* (చేర్చు)
12] contest*s* (పోటీపడు)
13] describe*s* (వర్ణించు)
14] come*s* (వచ్చు)
15] write*s* (వ్రాయు)
16] smell*s* (వాసన పీల్చు)
17] speak*s* (మాట్లాడు, ప్రసంగించు)
18] seperate*s* (విభజించు)
19] rise*s* (ఉదయించు)
20] set*s* (అస్తమించు)

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : The annual examinations begins tomorrow.
(√) : The annual examinations *begin* tomorrow.

2] (×) : My brother speak French very fluently.
(√) ; My brother *speaks* French very fluently.

3] (×) : My sister write with her left hand.
(√) : My sister *writes* with her left hand.

4] (×) : We celebrates the Republic Day on 26 January.
(√) : We *celebrate* the Republic Day on 26 January.

5] (×) : The sun rise in the east.
(√) : The sun *rises* in the east.

6] (×) : My daughter generally go to school by bus.
(√) : My daughter generally *goes* to school by bus.

7] (×) : Mary always come on time
(√) : Mary always *comes* on time.

8] (×) : The earth move round the sun.
(√) : The earth *moves* round the sun.

9] (×) : I goes for a walk every morning.
(√) : I *go* for a walk every morning.

10] (×) : I drinks hot coffee every morning.
(√) : I *drink* hot coffee every morning.

**EXERCISE - 10 :** *Correct the following sentences if necessory :*

1] Stephen teach us psychology.
2] Margarett go to church every Sunday.
3] The boys plays cricket every evening.
4] Robinson plays tennis very well.
5] I writes to my brother once a week.
6] He generally sleep in the open.

7] She read the newspaper everyday.
8] He understand the problem.
9] He get new magagines from the library every week.
10] Charity cover maltitude of sins.

**WORK SHEET :** అభ్యాసము-10లోని వాక్యములను- అవసరమైనచో.... సరిచేసి, చిత్తు పుస్తకములో వ్రాసికొని, జవాబులను- ఈ పుస్తకము చివర ఇచ్చిన 'KEY'సందు సరిచూచుకొని, వాక్యమునకు 1 మార్కు చొప్పున వేసికోండి ! Marks : [ ]

## Example No. : 25

Godse was hung for Mahatma Gandhi's murder. (×)
Godse was *hanged* for Mahatma Gandhi's murder. (✓)

సరిదిద్దిన దోషము : ఈ వాక్యము నందు verbనకు సంబంధించిన దోషము గలదు. "hanged" అను పదము "ఉరితీయుట" అను శిక్షను తెలుపుటకు ఉపయోగించుదురు. "hung" అను పదము ఇచట ఉపయోగించబడినది. కనుక.... ఈ వాక్యములో "ఉరితీయుట" అను భావమును తెచ్చుటకు "hung" అను పదమునకు బదులు- "hanged" అను పదమును ఉపయోగించి, వాక్యములో నున్న దోషమును సరిదిద్దడమైనది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? verb-wrong word.

వివరణ : పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు verb (క్రియ)నకు సంబంధించిన దోషము గలదు. ఈ వాక్యము "గాంధీ గారిని- గాడ్సే చంపినందుకు ఉరిశిక్ష విధించబడినది" అను భావము వచ్చేలా నిర్మించబడినది. ఈ భావమును తెలుపుటకు- "hanged" అను పదమును ఉపయోగించవలసి ఉంటుంది. కాని.... ఈ వాక్యములో "hanged" అను పదమునకు బదులు "hung" అను పదము ఉపయోగించబడినది. ప్రాణము లేని వస్తువులను వ్రేలాడదీసినపుడు మాత్రమే "hung" అను పదమును

ఉపయోగించాలి. కాని.... ఇచట "hung" అను పదము ఉపయోగించి నందున- వాక్యము దోషపూరితమైనది. దీనిని "hanged" అను పదమును ఉపయోగించి, సరిచేయదమైనది.

| Present tense (వర్తమాన కాలము) | Past tense (భూత కాలము) | Past participle (భూతార్థక అంశము) | Present participle (శత్రర్థకము) |
|---|---|---|---|
| 1] Hang (అకర్మకక్రియగా) వ్రేలాడు, వ్రేలాడదీయు | hung వ్రేలాడెను | hung వ్రేలాడి | hanging వ్రేలాడుచూ |
| 2] Hang (క్రమక్రియగా) ఉరితీయు, వ్రేలాడదీయు | hanged ఉరితీసెను | hanged ఉరితీసి | hanging ఉరితీయుచూ |

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : The picture was hanged on the wall.
(✓) : The picture was *hung* on the wall.

2] (×) : The murderer was caught and hung.
(✓) : The murderer was caught and *hanged*.

3] (×) : My sister hanged the clothes up to dry.
(✓) : My sister *hung* the clothes up to dry.

4] (×) : The policeman hanged his hat up.
(✓) : The policeman *hung* his hat up.

5] (×) : After shutting himself in the room he hung himself.
(✓) : After shutting himself in the room he *hanged* himself.

6] (×) : I hanged my shirt on that hook.
(✓) : I *hung* my shirt on that hook
7] (×) : My mother hanged her clothes over the fence.
(✓) : My mother *hung* her clothes over the fence.
8] (×) : The culprit was hung (నేరస్థుడు ఉరితీయబడెను).
(✓) : The culprit was *hanged.*
9] (×) : He hanged the umbrella on that bolt.
(✓) : He *hung* the umbrella on that bolt.
10] (×) : He was found guilty and hung.
(✓) : He was found guilty and *hanged.*

## Example No. : 26

The Gandhi park in Kanpur was besides the river. (×)
The Gandhi park in Kanpur was *beside* the river. (✓)

సరిదిద్దిన దోషము : ఈ వాక్యము నందు preposition (విభక్త్యర్థ పదము) నకు సంబంధించిన దోషము గలదు. "నది ప్రక్కనే కాన్పూరులోని గాంధి పార్క్ గలదు" అని అర్థము నివ్వవలసిన ఈ వాక్యము- "besides" అను పదమును ఉపయోగించుట వలన.... అలాంటి అర్థము వచ్చుట లేదు. కారణము "besides" అనగా "దీనికి తోడుగా, అదనముగా" అని అర్థము ! కనుక.... "besides" అను పదమునకు బదులుగా "ప్రక్కనే, దగ్గఱలో, సమీపమున" అను అర్థము నిచ్చు- "beside" అను పదము ఉపయోగించబడినది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Preposition-adverb (beside, besides).

వివరణ (Explanation) : "Beside, Besides" అను రెండు పదముల అర్థములు :-

Beside = ప్రక్కన, సమీపమున, దగ్గఱనే : ఇది preposition.
Besides = అంతేగాకుండా, దీనికి తోడుగా, దీనితోబాటు : ఇది adverb.

ఉదాహరణ : వాక్యములో preposition నకు సంబంధించిన దోషము గలదు. వాక్యములలో ఉపయోగించబడిన "beside, besides" అను రెండు పదములు చూచుటకు ఒకే రకముగా నున్ననూ.... భావములో ఎంతో తేడా కనిపిస్తుంది. "beside" అను prepositionను "by the side of=ప్రక్కనే" అను అర్థములో ఉపయోగిస్తారు. "besides" అను adverbను "in addition to, other than=దీనితోబాటు, అంతేగాకుండా, దీనికి తోడు" అను అర్థములో ఉపయోగిస్తారు.

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : The building was besides the river.
(✓) : The building was *beside* the river.

2] (×) : She plays Tennis beside Cricket, Golf and Carroms.
(✓) : She plays Tennis *besides* Cricket, Golf and Carroms.

3] (×) : My sister-in-law stood besides me.
(✓) : My sister-in-law stood *beside* me.

4] (×) : The man was standing besides her.
(✓) : The man was standing *beside* her.

5] (×) : Beside Psychology, we have to study philosophy and Biology.
(✓) : *Besides* psychology, we have to study philosophy and Biology.

6] (×) : We have two more houses beside this.
(✓) We have two more houses *besides* this.

7] (×) : Beside stealing all my money, they took my scooter.

(√) : *Besides* stealing all my money, they took my scooter.

8] (×) : Beside stealing my clothes, the servent damaged my car.

(√) : *Besides* stealing my clothes, the servent damaged my car.

9] (×) : Beside his suit, he was wearing a rain-coat.

(√) : *Besides* his suit, he was wearing a rain-coat.

10] (×) : Beside being punished, I was fined.

(√) : *Besides* being punished, I was fined.

**EXERCISE – 11** : *Correct the following sentences if necessory!*

1] The house stood besides the hill.

2] The child is sitting besides the fire.

3] She came and sat besides me.

4] There were three others present at the Mrs. Lucy. meeting besides.

5] Besides men, there were present many children.

6] A girl from china sits besides me in class.

7] Beside food, we need air and rest.

8] Let's talk about something beside politics.

9] Beside her relatives she invited her friends also.

10] Why don't you sit besides me?

**WORK SHEET** : పై అభ్యాసములోని వాక్యములను- అవసరమైనచో.... సరిచేసి, చిత్తు పుస్తకములో వ్రాసికొని, జవాబులను- ఈ పుస్తకము చివర ఇచ్చిన 'KEY' నందు సరిచూచుకొని, వాక్యమునకు 1 మార్కు చొప్పున వేసికోండి ! Marks : [ ]

# Example No. : 27

**By this time next week I shall take my university degree (x)**

**By this time next week I shall *have taken* my university degree. (✓)**

సరిదిద్దిన దోషము : ఈ వాక్యములో tense (కాలము)నకు సంబంధించిన దోషము గలదు. "shall take (తీసికొంటాను)" అను క్రియ Future Indefinite tenseలో నున్నది. దీనిని వాక్యములోని సందర్భమును బట్టి "shall have taken (తీసికొని వుండును)"గా మార్చబడినది. "shall have taken" అను క్రియ Future perfect tenseలో ఉన్నది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Verb-tense.

వివరణ : పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు verb (క్రియ) యొక్క tense (కాలము)నకు సంబంధించిన దోషము గలదు. ఈ వాక్యము- భవిష్యత్‌లో ఒక నిర్దిష్ట సమయమునకు ముందే ఒక పని "పూర్తి అయినద"ని తెలుపుచున్నది. ఇలాంటి సందర్భములో Future Indefinite tense నకు బదులుగా.... Future perfect tense ను ఉపయోగించాలి.

**Future perfect tense** అనగా నేమి? దిగువ ఉదాహరణ లోని భావమును- జాగ్రత్తగా గమనించిన.... "I shall have taken (నేను తీసికొని వుంటాను)". ఈ వాక్యములో verb ఏది ? "shall have taken (తీసికొని వుండును)" ఇది దేనిని తెలుపుతున్నది ? "తీసికొనుట" అను పని రానున్న కాలములో ముగించబడుతున్నట్లు తెలియజేస్తుంది.

ఈ విధముగా- ఒక పని రానున్న కాలములో ముగించనున్నట్లు తెలియజేయు క్రియ యొక్క స్వరూపమును "Future perfect tense" అని పిలువవచ్చును. ఈ దిగువ వాక్యమును కూడా గమనించండి :

"By this time next month I shall have finished writing a novel (వచ్చే నెలలో ఈ పాటికి నేను నవలను వ్రాయుట పూర్తి చేస్తాను)". ఈ వాక్యము నందు "భవిష్యత్తులో ఫలాన సమయమునకు అనుకొన్న పని పూర్తి అవుతుంది" అని తెలియుచున్నది. అనగా భవిష్యత్‌లో ఒకానొక time నకు పని పూర్తి అవుతుంది అనగా.... perfect అవుతుంది. అని చెప్పు సందర్భములో Future perfect tenseను ఉపయోగిస్తారు. అంతేగాని.... Future Indefinite tenseను ఉపయోగించరు.

**Future perfect tense లో నున్న మరికొన్ని వాక్యములు:**

1] We shall not have done (మేము చేసి యుండము).

2] My father will have bought (మా తండ్రి కొనియుందురు).

3] I shall have written (నేను వ్రాసి యుంటాను).

4] Will he have said (అతడు చెప్పి యుండునా)?

5] Will she not have taken (ఆమె తీసికొని యుండదా)?

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : In 1998 she will reach the goal.
(✓) : In 1998 she *will have reached* the goal.

2] (×) : She will reach home before the sun set.
(✓) : She *will have reached* home before the sun set.

3] (×) : We shall leave this place by the time he comes.
(✓) : We *shall have left* this place by the time he comes.

4] (×) : She will reach home before the storm comes.
(✓) : She *will have reached* home before the storm comes.

5] (×) : Mary will go to Calcutta before Moses arrives.
(✓) : Mary *will have gone* to Calcutta before Moses arrives.

**EXERCISE No. - 12 :** *Correct the following sentences if necessory !*

1] I shall type all the letters by 3 O' clock.
2] The plane will have landed by the time you reach the airport.
3] The train will leave by the time you reach the station.
4] The bus will have left by that time.
5] The fire will destroy all the huts by then.
6] By the time Margaret comes, the water will boil away.
7] I shall have read the novel by to-morrow.
8] I shall do my work before she comes.
9] In three years' time, he will take his Ph.D.
10] She will have left the theatre by 9 O' clock.

WORK SHEET : అభ్యాసము-12 నందలి వాక్యములను-అవసరమైనచో.... సరిచేసి, చిత్తు పుస్తకములో వ్రాసికొని, జవాబులను-ఈ పుస్తకము చివర ఇచ్చిన 'KEY' నందు సరిచూచుకొని, వాక్యమునకు మార్కు చొప్పున వేసికోండి ! Marks : [ ]

## Example No. : 28

The Man was granted a week leave. (×)
The Man was granted a *week's* leave. (✓)

సరిదిద్దిన దోషము : ఈ వాక్యము నందు Nounనకు సంబంధించిన దోషము గలదు. దోషము case (విభక్తి)ను ఉపయోగించుటలో వ్చబడినది. కాలమును తెలుపుతున్న పదము 'week'ను "week's"గా ార్చిన.... వాక్యములో దోషము లేకుండా పోతుంది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Noun-case.

వివరణ (Explanation) : Possessive caseను సాధారణముగా జీవించి యున్న ప్రాణులకు ఉపయోగిస్తారు Noun (నామ వాచకము)నకు "యొక్క" అను అర్థము నిచ్చు "S" అను అక్షరమును చేర్చి, possessive caseను ఏర్పఱచెదరు. ఉదాహరణకు దిగువ వాక్యములను చూడండి !

The farmer's crops failed this year also (రైతుల పంటలు).

Children's lives are full of happiness (పిల్లల జీవితములు లేదా ప్రాణములు).

David's car is in the A1 garage (డేవిడ్ యొక్క కార్).

The dog's tail was cut (కుక్క యొక్క తోక).

అయితే possessive case (షష్ఠి విభక్తి)ని నిర్జీవులు అనగా వస్తువులు మొదలగు వాని విషయములో ఉపయోగించరు. వివరములకు దిగువ tableను చూడండి !

| *Correct form* (సరైన రూపము) | *Incorrect form* (సరికాని రూపము) |
|---|---|
| The leg of the chair | chair's leg |
| The price of the book | book's price |
| The roof of the building | building's roof |
| The pages of the book | book's pages |
| The electrification of the theatre. | Theatre's electrification. |

కేవలము ప్రాణమున్న జీవుల విషయములోనే గాకుండా possessive case (షష్ఠి విభక్తి)ని : 1] Time (కాలము), 2] Value (విలువ), 3] weight (బరువు), 4] Spece (ఆకాశము, శూన్యము, ఖాళీ)లకు చెందు Nouns విషయములో కూడా ఉపయోగించవచ్చును.

దిగువ ఉదాహరణలను పరిశీలించండి :

1] A pound's weight (పౌండ్ భారము).

2] A minute's glance (క్షణకాలపు వెలుగు లేదా శోభ).

3] Five day's Journey (ఐదురోజుల ప్రయాణము).

4] a foot's length (అడుగు పొడవు).

5] a hair's breadth (వెంట్రుక వాసి).

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : The name of Mr. Nelson dog was Bobby.
(✓) : The name of *Mr. Nelson's dog* was Bobby.

2] (×) : The husband of my sister is coming to dinner to-day.
(✓) : *My sister's husband* is coming to dinner to-day.

3] (×) : Have you seen my brother Car ?
(✓) : Have you seen *my brother's Car ?*

4] (×) : My mother is going to the grocer shop.
(✓) : My mother is going to the *grocer's shop.*

5] (×) : This chair's leg is broken.
(✓) : *The leg of this Chair* is broken.

**EXERCISE - 13 :** *Correct the following sentences if necessory :*

1] We raised funds for the temple's renovetion.

2] My class-teacher went on a month leave.

3] I always keep her at arm length.

4] We heard the children shouts in the distance.

5] The wife of my friend is talking to me.

6] The building's roof is partly damaged.

7] This is the girl's bedroom (ఇది బాలికల పరుండు గది).

8] They are Alexander's books (అవి అలెగ్జాండర్ పుస్తకములు).

9] He is reading yesterday's newspaper (అతడు నిన్నటి వార్తాపత్రికను చదువుతున్నాడు).

10] My house is a stone's throw from here (మా ఇల్లు ఇచట నుండి రాయి విసరగల దూరములో వున్నది).

**WORK SHEET :** పై అభ్యాసములోని వాక్యములను- అవసరమైనచో.... సరిచేసి, చిత్తు పుస్తకములో వ్రాసికొని, జవాబులను- ఈ పుస్తకము చివర ఇచ్చిన 'KEY' నందు సరిచూచుకొని, వాక్యమునకు 1 మార్కు చొప్పున వేసికోండి ! Marks : [ ]

## Example No. : 29

We are going to U.S.S.R. for further studies. (×)

We are going to *the* U.S.S.R. for further studies (✓)

సరిదిద్దిన దోషము : ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు Articlesనకు సంబంధించిన దోషము గలదు. "U.S.S.R." అను విడి అక్షరములు గల దేశముల పేర్ల ముందు "the" అను Definite articleను తప్పనిసరిగా ఉపయోగించవలెను.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Articles (The).

వివరణ **(Explanation) :** పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు "The" అను Definite article నకు సంబంధించిన దోషము గలదు. బహువచనములో నున్న దేశముల పేర్ల ముందు, సంక్షిప్త అక్షరములలో (abbreviations) తెలుపబడిన దేశముల పేర్లముందు తప్పనిసరిగా "The" అను Definite articleను ఉపయోగించవలెను. ఉదాహరణకు ఈ దిగువ దేశముల పేర్లను పరిశీలించండి.

1] U.S.S.R. : ఇది సంక్షిప్తము చేయబడిన ఒక దేశము పేరు! దీనిని విస్తరించిన "Union of Soviet Socialist Republics (యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్స్)"! ఇది అనేక చిన్న చిన్న రాజ్యముల కూటమి! ఇందు సుమారు 14 రిపబ్లిక్స్ గలవు కనుక.... ఇలాంటి పలు రాజ్యముల కూటమి బహువచనములో వుండుట వలన దీని ముందు తప్పనిసరిగా "The" అను Definite articleను ఉపయోగించవలెను.

2] U.S.A. : "United States of America (యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా)"! ఇది పలు రాష్ట్రముల (రాజ్యముల) కూటమి! ఇందులో మొత్తము 50 రాష్ట్రములు గలవు. కనుక.... దీని ముందు కూడా "The" అను definite articleను ఉంచవలెను.

3] U.A.E. : "United Arab Emirates (యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్)"! ఇందు పర్షియన్ గల్ఫ్ ప్రాంతములోని 7 రాజ్యములు కలసి వున్నవి. కనుక.... దీని ముందు కూడా "The" అను Definite articleను ఉపయోగించాలి.

4] Netherlands (నెదర్లాండ్స్) : ఇది బహువచనములో నున్న దేశపు పేరు! కావున.... దీని ముందు కూడా "The" అను articleను ఉపయోగించాలి.

దేశముల పేర్లు : Burma, Canada, India, Pakistan, Nepal, Japan, Kenya, Denmark, Egypt, Peru, Uganda మొదలగు దేశముల పేర్ల ముందు "The" అను Definite articleని ఉపయోగింపరాదు.

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : Ottawa is the capital city of the Canada.
(✓) : Ottawa is the capital city of Canada.

2] (×) : He is going to U.S.S.R. next week.
(✓) : He is going to *the* U.S.S.R. next week.

3] (×) : The Nepal is rich in forest wealth and quartz deposits.
(✓) : Nepal is rich in forest wealth and quartz deposits.

4] (×) : The Zambia became independent on 24th October 1964.
(✓) : Zambia became independent on 24th October 1964.

5] (×) : United Arab Emirates consist of seven sheik-doms in the persian Gulf.
(✓) : The United Arab Emirates consist of sheik-doms in the persian Gulf.

**EXERCISE - 14 :** *Correct the following sentences if necessory !*

1] Netherlands is located in Europe.
2] The Jamaica is situated in the Caribbean Sea.
3] Stockholm is the capital city of the sweden.
4] This watch is made in the India.
5] The Tonga became a British-protected state in 1900.
6] Who is the richest man in United States of America ?
7] The Angola is famous for its gemstones.
8] The Argentina is abandoning its 106-year old capital Buenos Aires.
9] China launched its first earth satellite in April, 1970.
10] The Luxembourg is a small state lying in between Germany, Belgium and France.

**WORK SHEET :** పై అధ్యాయములోని వాక్యములను- అవసరమైనచో.... సరిచేసి, చిత్తు పుస్తకములో వ్రాసికొని, జవాబులను- ఈ పుస్తకము చివర ఇచ్చిన 'KEY'నందు సరిచూచుకొని, వాక్యమునకు 1 మార్కు చొప్పున వేసికోండి ! Marks : [ ]

# Example No. : 30

He was addicted with drink. (×)

He was addicted *to* drink. (✓)

సరిదిద్దిన దోషము : పై ఉదాహరణ యందు preposition (విభక్త్యర్థ పదము) నకు సంబంధించిన దోషము గలదు. ఇచట అనగా.... ఈ సందర్భములో "with" అను పదమును ఉపయోగించరాదు. "to" అను పదమును మాత్రమే ఉపయోగించవలెను.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Preposition.

వివరణ **(Explanation)** : పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు preposition (విభక్త్యర్థ పదము)నకు సంబంధించిన దోషము గలదు. ఆంగ్ల భాష నందు చాల Nouns (నామ వాచకములు), Adjectives (విశేషణములు), verbs (క్రియలు) మరియు Participles (ed మరియు ingలతో కూడిన verbs) 'ప్రత్యేకమైన లేదా తగిన prepositions' appropriate prepositionsతో వస్తాయి. అనగా.... ఒక పదముతో ఒక ప్రత్యేకమైన preposition మాత్రమే వస్తుంది, కొన్నిసార్లు ఒక పదముతో రెండు లేదా అంతకన్నా ఎక్కువ prepositions రావచ్చును.

ఉదా॥ : I am *ashamed for* your conduct.

I am *ashamed of* your conduct.

ఇలాంటి appropriate prepositions ఉపయోగించునపుడు చాల జాగ్రత్తగా ఉండవలెను. స్వంత ఆలోచనతో వేతే prepositions ఉపయోగించరాదు.

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : The chinese are generally addicted with opium smoking.

(√) : The chinese are generally *addicted to* opium smoking.

2] (×) : David has been absent to classes for two days.

(√) : David has been *absent from* classes for two days.

3] (×) : He deals with woollen garments.

(√) : He *deals in* woollen garments

4] (×) : This book is dedicated for my grand-father.

(√) : This book is *dedicated to* my grand-father.

5] (×) : I am hopeful to winning a prize.

(√) : I am *hopeful of* winning a prize.

6] (×) : Sivarasan was charged for the murder of Rajiv Gandhi.

(√) : Sivarasan was *charged with* the murder of Rajiv Gandhi.

7] (×) : He handed it by to the Police.

(√) : He *handed* it *over* to the Police.

8] (×) : Some one is Knocking on the door.

(√) : Some one is *Knocking at* the door.

9] (×) : I am proud about you.
(✓) : I am *proud of* you.

10] (×) : She retired in service at the age of fifty-eight.
(✓) : She *retired from* service at the age of fifty-eight.

**EXERCISE No. - 15 :** *Correct the following sentences if necessory !*

1] The year 1877 is memorable of a severe famine.
2] Three prisoners escaped from the jail.
3] He belongs to scheduled caste.
4] We should avoid contact to evil persons.
5] He fired on the bird, but missed it.
6] The president presided over the function.
7] Water is indispensable for organic life.
8] You must abide with the terms of the contract.
9] Don't you believe in my honesty?
10] Children are fond of sweets.

**WORK SHEET :** పై అభ్యాసము లోని వాక్యములను- అవసరమైనచో.... సరిచేసి, చిత్తు పుస్తకములో వ్రాసికొని, జవాబులను- ఈ పుస్తకము చివర ఇచ్చిన 'KEY' నందు సరిచూచుకొని, వాక్యమునకు 1 మార్కు చొప్పున వేసికోండి! Marks : [ ]

## Example No. : 31

The two sisters loved one another. (×)
The two sisters loved *each other.* (✓)

సరిదిద్దిన దోషము : ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు pronoun (సర్వనామము) నకు సంబంధించిన దోషము గలదు. వాక్యములో "One another" అను మాటను ఉపయోగించి నందువలన

దోషము ఏర్పడినది. ఈ దోషమును తొలగించుటకు- 'one another' వున్నచోట- "each other" అను మాటను ఉపయోగించవలెను.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Pronoun.

వివరణ **(Explanation) :** ఈ వాక్యము నందు Pronoun (సర్వనామము)నకు సంబంధించిన దోషము గలదు. each other, one another అను రెండు మాటల భావము ఒక్కటే ! అయితే.... ఉపయోగించుటలో తేడా గలదు. "Each other" అను మాటను ఇద్దరి గురించి చెప్పునపుడు ఉపయోగించవలెను. "One another" అను మాటను- ముగ్గురు లేదా అంతకన్నా ఎక్కువమంది విషయములో ఉపయోగించవలెను.

మరువరాని విషయములు **(Points to Remember) :**

1] Each other : రెండు లేదా ఇద్దరి విషయములో ఈ మాటను ఉపయోగించాలి.

2] One another : మూడు లేదా అంతకన్నా ఎక్కువ ఉన్న వాటి విషయములో ఈ మాటను ఉపయోగించవలెను.

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : The couple seemed to love one another very much.
(√) : The couple seemed to love *each other* very much.

2] (×) : The two cousins hated one another from their childhood.
(√) : The two cousins hated *each other* from their childhood.

3] (×) : Politicians often blame each other
(√) Politicians often blame *one another.*

4] (×) : The two neighbours quarrelled with one another.

(✓) : The two neighbours quarrelled with *each other.*

5] (×) : The boxers hit one another.

(✓) : The boxers hit *each other.*

**EXERCISE – 16 :** *Correct the following sentences if necessory :*

1] Students should respect each other.
2] Our class students never quarrel with one another.
3] Moses and Mary love each other dearly.
4] The four room-mates don't like each other.
5] The twins loved one another.

**WORK SHEET** : పై అభ్యాసములోని వాక్యములను- అవసరమైనచో.... సరిచేసి, చిత్తు పుస్తకములో వ్రాసికొని, జవాబులను- ఈ పుస్తకము చివర ఇచ్చిన 'KEY' నందు సరిచూచుకొని, వాక్యమునకు- 1 మార్కు చొప్పున వేసికోండి. Marks : [ ]

# Example No. : 32

Alexander is Junior than my brother. (×)

Alexander is *Junior to* my brother. (✓)

సరిదిద్దిన దోషము : ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు conjunction (కలిపెడి పదము)నకు సంబంధించిన దోషము గలదు. వాస్తవమునకు దోషము conjunction నకు సంబంధించినదే అయిననూ.... Adjective (విశేషణము) ప్రధానపాత్ర వహిస్తుంది. Degrees of Comparisionలో Comparative degreeకి సంబంధించిన ఉదాహరణ ఇది ! Comparative degreeని పోలిక చెప్పుచున్నపుడు ఉపయోగిస్తారు. ఈ క్రింది ఉదాహరణను పరిశీలించండి :

**Example :** "Simla is cooler than Bangalore (బెంగుళూర్ కన్నా.... సిమ్లా నగరము చల్లగా వుంటుంది)"

వివరణ : ఈ వాక్యములో "Cooler" అనేది Adjective. ఇది Comparision (పోలిక) చెప్పుటకు thanతో కలిపి ఉపయోగించ బడినది. అనగా.... "Than" అను పదమును పోలిక చెప్పుటకు అనగా పోల్చుటకు ఉపయోగిస్తారు. అనగా.... Comparative degreeలో పోలిక చెప్పుటకు అనగా.... పోల్చుటకు "Than" అనే Conjunctionని ఉపయోగించుట పరిపాటి ! కాని.... ఇచట "To" అను Conjunctionని ఉపయోగించుటయే సరియైన పద్ధతి ! కారణము తరువాత తెలుసుకుందాము !

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Conjunction (than-to).

వివరణ : ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు conjunctionనకు సంబంధించిన దోషము గలదు. సాధారణముగా Comparative degreeలో పోలిక చెప్పుటకు అనగా పోల్చుటకు "than" అను Conjunctionను ఉపయోగిస్తారు. ఉదా॥ : She is wiser *than* all the other girls of her class.

కాని Latin Adjectives వున్న వాక్యము లందు "than" అను పదమునకు బదులు "to" అను పదమును ఉపయోగించవలెను.

**Latin Adjectives** ఏవనగా అవి : 1] Junior (జూనియర్), 2] Senior (సీనియర్), 3] inferior (ఇన్‌ఫీరియర్), 4] superior (సుపీరియర్), 5] anterior (యాంటీరియర్), 6] posterior (పోస్టీరియర్), 7] prior (ప్రయ్యర్), 8] prefer (ప్రిఫర్).

మఱువరాని విషయము : Latin Adjectives వున్న Comparative sentences నందు "Than" అను పదమును ఉపయోగించరాదు. దాని స్థానములో "to" అను మాటను ఉపయోగించవలెను.

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : She is senior than me by six years.
(✓) : She is *senior to* me by six years.

2] (×) : She feels that she is superior than all.
(✓) : She feels that she is *superior to* all.

3] (×) : Margaret was junior than him in service.
(✓) : Margaret was *junior to* him in service.

4] (×) : This cloth is inferior than that.
(✓) : This cloth is *inferior to* that.

5] (×) : The quality of my watch is superior than that of yours.
(✓) : The quality of my watch is *superior to* that of yours.

**EXERCISE - 17 :** *Correct the following sentences if necessory :*

1] My shirt is more beautiful to yours.
2] Your calculator is superior than me.
3] I am senior than you by three years.
4] She is junior than you by seven years.
5] Moses is inferior than Alexander in intelligence.

**WORK SHEET :** పై అభ్యాసములోని వాక్యములను- అవసరమైనచో.... సరిచేసి, చిత్తు పుస్తకములో వ్రాసికొని, జవాబులను- ఈ పుస్తకము చివర ఇచ్చిన 'KEY' నందు సరిచూచుకొని, వాక్యమునకు- 1 మార్కు చొప్పున వేసికోండి ! Marks : [ ]

## Example No. : 33

The secretary and correspondent were present. (×)
The secretary and *the* correspondent were present. (✓)

సరిదిద్దిన దోషము : ఈ వాక్యము నందు articlesనకు సంబంధించిన దోషము గలదు. "The secretary and correspondent" అను Subject నందు "correspondent" అను పదమునకు ముందు కూడా "The" అను articleను వుంచాలి.

దోషము ఏ భాగమునకు చెందుతుంది? Articles.

వివరణ : ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు Articles నకు సంబంధించిన దోషము గలదు. ఒకే Nounను లేదా వ్యక్తిని రెండు Adjectives (విశేషణములు) refer చేస్తున్నపుడు- మొదటి adjective నకు ముందే "The" అను Definite articleను ఉపయోగించాలి. అలాగాక.... రెండు Adjectivesనకు ముందు రెండు 'The'లు వుంచిన- ఒక వ్యక్తినిగాక.... ఇద్దరు వ్యక్తులను తెలుపును. అపుడు Subject (కర్త) plural numberగా మారుతుంది. Verbను కూడా plural number లోనికి మార్చాలి.

మఱువరాని విషయము : ఒకే వ్యక్తిని రెండు Adjectives (విశేషణములు) refer చేస్తున్నపుడు- అందు మొదటి Adjective నకు ముందు మాత్రమే- "The" అను Definite articleను వుంచాలి. అలాగాక.... రెంటిముందు కూడా 'The'ని వుంచితే...., అపుడు ఇద్దరు వ్యక్తులను గుఱించి చెప్పుచున్నట్లగును.

# Example No. : 34

**Seeing her aunt, she made a cup of tea for her. (×)**

***Having seen*** **her aunt, she made a cup of tea for her. (✓)**

సరిదిద్దిన దోషము : ఇది Synthesisనకు సంబంధించిన దోషము గలదు. పై వాక్యములోని సందర్భమును బట్టి "Seeing" అను పదమును ఉపయోగించరాదు. దాని స్థానములో "Having seen" అను మాటను వుంచవలెను.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Synthesis.

వివరణ (Explanation): ఈ ఉదాహరణలో ఇచ్చిన రెండు భాగములు past tenseలో ఉన్నాయి. అందులో.... "She made a cup of tea for her" అనేది పూర్తి అర్థముగల వాక్యము ! కాని.... "Seeing her aunt" వాక్యము కాదు ఎందుకనగా.... దీనిలో verb లేదు. దీనిలో "Seeing" అనేది ఒక Participle రూపము ! దీనిని వాక్యముగా మార్చిన.... "She sha her aunt" అవుతుంది. "She saw her aunt." "She made a cup of tea for her." ఈ రెండు వాక్యములను కలిపిన "Having seen her aunt, she made a cup of tea for her" అవుతుంది. ఇది మొత్తము ఒక వాక్యము ! ఇందులో- "Having seen her aunt" అనే భాగము perfect participle phrase.

"She saw her aunt." "She made a cup of tea for her." ఈ రెండు వాక్యములలో ముందు జరిగిన (earlier past action) పని ఏది ? "She sha her aunt." తరువాత జరిగిన పని ఏది ? "She made a cup of tea for her." కనుక.... ముందు జరిగిన పనిని participle phraseగా మార్చాలి.

1] వెంటవెంటనే జరిగిన రెండు past actionsను కలిపి, ఒక simple sentenceగా మార్చునపుడు- present participleను ఉపయోగించాలి.

2] అలాగాక.... రెండు past actions ఒక దాని తరువాత ఒకటి మధ్యలో కొంత విరామముతో జరిగిన.... perfect participleను ఉపయోగించాలి. "She saw her aunt" "She made a cup of tea for her." "Having seen her aunt, she made a cup of tea for her."

వివరణ : ఆమె తన aunt (అత్త, పిన్ని)ని చూచిన తరువాత 'tea' తయారుచేసే ముందు- గిన్నె కడుగుట, పొయ్యి వెలిగించుట, నీరు తీసికొని, పోడివేసి, మరగించుట మొదలగు పలుపర్యలను చేస్తుంది.

**"She switched off the light." "She went to bed."**
**"Switching of the light, she went to bed."**

# Example No. : 35

**The stranger stays this evening here.** (×)
**The stranger stays *here* this evening.** (✓)

సరిదిద్దిన దోషము : పై ఉదాహరణలో- Adverb నకు సంబంధించిన దోషము గలదు. ఇచట here స్థానము మార్చబడినది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Adverbs.

వివరణ : **(Explanation)** : పై వాక్యమునందు Adverb నకు సంబంధించిన దోషము గలదు. ఇచట తగిన స్థానములో Adverbsను ఉపయోగించలేదు. ఈ వాక్యములో "here (ఇచట)" అను పదము- place (స్థలము) ను; "This evening (ఈ సాయంత్రము)" అను phrase- రెంటిని, కాలము (time) ను తెలుపుచున్నవి. ఆంగ్ల సంప్రదాయము ప్రకారము- స్థలమును, కాలమును తెలుపు పదములు వున్నపుడు స్థలమును తెలియజేయు క్రియావిశేషణ పదము (ల)ను ముందు అనగా.... verb నకు అతి దగ్గఱలోను, కాలము (time) ను సూచించు క్రియా విశేషణ పదము (లను) ఆ తరువాతను ఉపయోగించవలెను. కనుక....ఈ వాక్యమునందు ముందుగా "here" అను క్రియా విశేషణమును, తరువాత "this evening" అను క్రియా విశేషణ పదముల (Adverbial phrase) ను ఉపయోగించవలెను.

కొన్ని మాదిరి వాక్యములు:

**1] (×) : They will be tomorrow here.**
**(✓) : They will be *here* tomorrow.**

2] (×) : Please you go at once there.
(✓) : Please you go *there* at once.

3] (×) : Come as early as possible here.
(✓) : Come *here* as early as possible.

4] (×) : My friend visited three years ago Calcutta.
(✓) : My friend visited *Calcutta* three years ago.

5] (×) : Aeroplanes reach quickly Japan.
(✓) : Aeroplanes reach *Japan* quickly.

## Example No. : 36

My sister was dressed in pink colour. (×)
My sister was dressed in pink. (✓)

సరిదిద్దిన దోషము : ఉదాహరణ యందు ఇచ్చిన వాక్యము నందు- అనవసరపు, అదనపు వివరణ ఉన్నది. "Colour (రంగు)" అనే పదమును అవసరము లేకున్ననూ..... ఉపయోగించబడి నందున- ఆ పదమును తొలగించి, వాక్యములోని దోషమును సవరించడమైనది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Adjective (unnecessory words).

వివరణ (Explanation) : పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యమునందు- అనవసరపు, అదనపు నిచ్చట వివరణ జరిగినది. ఇందు "colour (రంగు, వర్ణము)" అను పదము అవసరము లేకున్ననూ ఉపయోగించబడినది. "Pink (గులాబిరంగు)" అను Adjective (విశేషణము) రంగును తెలియజేయును గావున....మరల రంగును తెలియజేయు వుద్దేశ్యముతో "pink" అను పదము తరువాత "Colour" అను పదమును ఉపయోగించరాదు. రంగును తెలియజేయు పదముల తరువాత "colour" అను పదమును ఎట్టి పరిస్థితులలోను ఉపయోగించకూడదు.

రంగును తెలియజేయు కొన్ని పదములు : 1] Blue (నీలము), 2] Black (నలుపు), 3] Green (ఆకుపచ్చ, హరిత వర్ణము), 4] Orange (నారింజ వర్ణము), 5] Red (ఎరుపు), 6] Rose (గులాబిరంగు), 7] White (తెలుపు), 8] Yellow (పసుపు వర్ణము).

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : The baby dressed in green colour.
(✓) : The baby dressed in green.

2] (×) : My suitcase is in yellow colour.
(✓) : My suitcase is in yellow.

3] (×) : The Army was dressed in green colour.
(✓) : The Army was dressed in green.

4] (×) : The school children dressed in white colour.
(✓) : The school children dressed in white.

5] (×) : He painted the car blue colour.
(✓) : He painted the care blue.

## Example No. : 37

She is waiting for the bus since 8 O' clock. (×)
She *has been waiting* for the bus since 8 O' clock. (✓)

సరిదిద్దిన దోషము : పై ఉదాహరణతో ఇచ్చిన వాక్యము నందు verb (క్రియ) యొక్క Tense (కాలము) నకు సంబంధించిన దోషము గలదు. ఈ వాక్యములోని verb అయిన 'is waiting' ను- "has been waiting"గా మార్చి, వాక్యములోని దోషమును సరిదిద్దడ మైనది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది? Verb (tense).

వివరణ (**Explanation**) : ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు verb యొక్క tense (కాలము) నకు సంబంధించిన దోషము గలదు. ఈ వాక్యములోని verb (క్రియ)- present continuous లో వున్నది. ఇలా వుండుట తప్పు! ఎందుకనగా.... ఒక పని past (గతములో) ప్రారంభమై, ప్రస్తుతము కూడా జరుగుచున్నపుడు 'present perfect continuous tense' ను మాత్రమే వాడాలి. అంతేగాని.... present continuous tense ను ఉపయోగించరాదు. ఈ వాక్యములో పేర్కొన్నవని short period (కొద్దికాలము) నకు సంబంధించినది.

**కొన్ని మాదిరి వాక్యములు :**

**1] (×) : We are playing at cards since 8 P.M.**
**(✓) : We *have been playing* at cards since 8 P.M.**

**2] (×) : It is raining for three hours.**
**(✓) : It *has been raining* for three hours.**

**3] (×) : The boys are playing cricket since 8 O' clock.**
**(✓) : The boys *have been playing* cricket since 8 O' clock.**

**4] (×) : The child is sleeping for seven hours.**
**(✓) : The child *has been sleeping* for seven hours.**

**5] (×) : The cat is chasing the rats for an hour.**
**(✓) : The cat *has been chasing* the rats for an hour.**

**EXERCISE-18 :** *Correct the following sentences if necessory :*

1] We are sweating in the smithy sinces seven O' clock.
2] She is singing songs since three O' clock.
3] They are washing their hands for ten minutes.
4] The boys are making a noise for fifteen minutes.
5] The teacher is teaching us for twenty minutes.

6] The child has been crying in hunger since 8 O' clock
7] The juggles is showing his feats for two hours.
8] I have been doing my home-work for an hour.
9] The wrestlers are grappling since 9 a.m.
10] My wife has been combing her hair for five minutes.

**WORK SHEET :** పై అభ్యాసములోని వాక్యములను- అవసర మైనచో.... సరిచేసి, చిత్తు పుస్తకములో వ్రాసికొని, జవాబులను- ఈ పుస్తకము చివర ఇచ్చిన 'KEY' నందు సరిచూచుకొని, వాక్యమునకు- 1 మార్కు చొప్పున వేసికోండి !

Marks : [ ]

## Example No. : 38

**Ten years passed since my grand mother has died. (x)**
**Ten years *have passed* since my grand mother *died*. (√)**

సరిదిద్దిన దోషము : పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు- tense నకు సంబంధించిన దోషము గలదు. ఈ వాక్యము నందు "since" అను పదము Preposition వలె గాక.... Conjunction వలే ఉపయోగించబడినది. ఈ వాక్యము నందు రెండు క్రియలు గలవు. అవి వరుసగా- 1] passed, 2] has died. ఈ రెంటినీ 1] have passed, 2] died గా మార్చి; వాక్యము సరిచేయబడినది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Tense & Conjunction (since).

వివరణ **(Explanation) :** పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యమునందు "since" అను పదమును Preposition వలే గాక.... Conjunction గా ఉపయోగించబడినది. ఈ వాక్యము నందు రెండు క్రియలు గలవు. అవి : "1] passed, 2] has died" అనునవి. "Since" అను పదమును conjunction వలే ఉపయోగించిన వాక్యము

సందున్న క్రియంలో ముందున్నది- Present perfect tense లోను, తరువాత నున్న క్రియ past Indefinite tense లోను వుండును.

Present perfect tense (since), past Indefinite tense.

**Example :** Six hours *have passed* since he *fell* asleep.

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : Where were you since I last saw you ?
(✓) : Where *have* you *been* since I last saw you ?
2] (×) : She has not seen me since she has come here.
(✓) : She has not seen me since she *came* here.
3] (×) : He has been ill since he has come here.
(✓) : He has been ill since he *came* here.
4] (×) : Two years passed since I have bought this house.
(✓) : Two years *have passed* since I *bought* this house.
5] (×) : A long time passed since she has written to me.
(✓) : A long time *has passed* since she *wrote* to me.

## Example No. : 39

If I was you, I should not marry him. (×)
If I *were* you, I should not marry him. (✓)

సరిదిద్దిన దోషము : ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు verb నకు సంబంధించిన దోషము గలదు. "was" అను క్రియ (verb)ను ఈ వాక్యములో ఉపయోగించకూడదు. దాని స్థానములో "were" అను క్రియను ఉపయోగించిన.... వాక్యములో దోషము తొలగించి నట్లౌతుంది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Verb-Subjunctive mood.

**వివరణ (Explanation)** : పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యమునందు verb యొక్క mood నకు సంబంధించిన దోష మున్నది. సాధారణముగా "I" అను pronoun ప్రక్కన- present tense లో అయితే.... "am"అను verb, past tense లో అయితే...."was"అనే verb వస్తుంది. కాని....వాక్యము Subjunctive mood లో నున్నపుడు 'I' ప్రక్కన 'were' వస్తుంది. ఈ వాక్యము "నేను-నీవై ఉండిన ఎడల" అను అసంభవమైన ఊహాగానమును తెలుపుతున్నది. ఇటువంటి సందర్భములో అనగా....వాక్యము Subjunctive moodలో నున్నపుడు-subject తరువాత వచ్చు Verb తప్పనిసరిగా past tense (భూత కాలము) లోను మరియు plural number (బహు వచనము) లోను ఉండవలెను.

గుర్తుంచుకోవలసిన విషయము : Subjective mood లో నున్న వాక్యమునందు సాధారణముగా రెండు clauses (ఉప వాక్యములు) ఉంటాయి.

అవి : 1] Subordinate clause (అస్వతంత్ర ఉప వాక్యము).

2] Main clause (స్వతంత్ర లేదా సంపూర్ణ ఉప వాక్యము).

Subordinate clause లోని Subject ఏ number (వచనము)లో వున్నప్పటికి- verb మాత్రము- తప్పనిసరిగా past tense, plural number లో వుంటుంది.

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : If I am you, I would buy an elephant.

(✓) : If I *were* you, I would buy an elephant.

2] (×) : If he was rich, he would buy a car.

(✓) : If he *were* rich, he would buy a car.

3] (×) : If she was here, she would help us.
(✓) : If she *were* here, she would help us.

4] (×) : If my mother was here now, she would show me how to cook.
(✓) : If my mother *were* here now, she would show me how to cook.

5] (×) : If he was here, I would give him the keys.
(✓) : If he *were* here, I would give him the keys.

**EXERCISE – 19 :** *Correct the following sentences if necessory !*

1] Was he my brother, I would know more about him.
2] Were he the manager, he would be telling the others what to do.
3] Was she not a friend of mine, I would n't lend her my necklace.
4] If I am rich I would n't work at all.
5] If I was the Prime Minister, I should centrole the poverty.
6] If I am you, I should not accept such terms.
7] If I were a rat, the cat should eat me.
8] If I am you, I wouldn't buy that watch.
9] If I were rich, I would build a castle.
10] Would you be able to buy a car if it were a little less expensive ?

**WORK SHEET :** పై అభ్యాసములోని వాక్యములను- అవసరమైనచో.... సరిచేసి, చిత్తు పుస్తకములో వ్రాసికొని, జవాబులను- ఈ పుస్తకము చివర ఇచ్చిన 'KEY' నందు సరిచూచుకొని, వాక్యమునకు 1 మార్కు చొప్పున వేసికోండి ! Marks : [ ]

# Example No. : 40

My birthday is on fourteen September. (×)
My birthday is on *the fourteenth of September.* (√)

సరిదిద్దిన దోషము : పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు- తేది (date) నకు సంబంధించిన దోషము వున్నది. ఈ వాక్యములో తప్పుగా ఉపయోగించబడిన తేది 'fourteen September' ను, "the fourteenth of September" గా మార్చాలి.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? date (తేది).

వివరణ **(Explanation) :** పైన ఇవ్వబడిన ఉదాహరణలోని వాక్యము నందు తేది (date) నకు సంబంధించిన దోషము వున్నది. తేదీలకు సంబంధించిన దోషమును సాధారణముగా వదలివేస్తుంటారు. అలా చేయుట చాల పెద్ద పొరపాటు! తేదీలను రెండు విధములుగా తెలుపుతుంటారు. ఆ విధములు ఏవనగా :

1] *The fourth of* June (దీని భావము- జూన్ నాలుగవ తేది అని), *the fourteenth of* September (దీని భావము- సెప్టెంబర్ పదునాలుగవ తేది అని).

2] June *the fourth* (దీని భావము- జూన్ నాలుగవ తేది అని), September *the fourteenth* (దీని భావము- సెప్టెంబర్ పదునాలుగవ తేది అని).

రెండవ అంశములో చెప్పినట్లుగా అమెరికా దేశములోని ప్రజానీకము తేదీలను తెలుపుతుంటారు. మొదటి అంశములో తెలిపినట్లుగా.... బ్రిటీష్ దేశస్థులు మరియు ప్రపంచములోని అధిక దేశములు తేదీలను చెబుతుంటారు. తారీఖులను వ్రాయునపుడు the, of మరియు th, etc. వంటివి తొలగించవచ్చును.

గమనిక : *2 (nd)* July, 1992 మరియు August 15 *(th)*,

1992 తారీఖులను పూర్తి అంకెలలో వేయునపుడు- 1] అమెరికా దేశస్థులైతే.... తారీఖునకు ముందు నెలను వేస్తుంటారు.

ఉదాహరణ : 4-6-1986 :- దీని అర్థము అమెరికాలో అయితే.... ఏప్రిల్, నాలుగవ తేది, పందొమ్మిది వందల ఎనభై ఆరవ సంవత్సరము.

2] బ్రిటన్ దేశములోని ప్రజలు మరియు ప్రపంచ దేశములందు అధిక సంఖ్యాక ప్రజలు ముందు తేదీని, తరువాత నెలను, ఆ తరువాత సంవత్సరమును వేస్తుంటారు

ఉదాహరణ : 30-3-1985 :- దీనర్థము బ్రిటన్‌లోను, అధిక ప్రపంచ దేశములందు ముప్పయ్యవ తారీఖు, మార్చి నెల, పందొమ్మిది వందల ఎనభై ఐదవ సంవత్సరము!

**కొన్ని మాదిరి వాక్యములు :**

1] (×) : I was born or March sixth.
(✓) : I was born on March *the* sixth

2] (×) : My brother's marriage day is on Six June 1991.
(✓) : My brother's marriage day is on 6-6-1991.

3] (×) : My father comes on fourth June.
(✓) My father comes on *The fourth of June.*

4] (×) : We bought this radio on August 6th 1989.
(✓) : We brought this radio on *August* 6, 1989.

5] (×) : My birthday is On 6-18-1959.
(✓) : My birthday is On 18-6-1959.

## Example No. : 41

The aeroplane was flying above the city. (×)
The aeroplane was flying *over* the city. (✓)

సరిదిద్దిన దోషము : పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యమునందు preposition (విభక్త్యర్థ పదము) నకు సంబంధించిన దోషము

గలదు. ఈ వాక్యములో ఉపయోగించబడిన "above" అను preposition నకు బదులుగా "over" అను prepositionను ఉపయోగించిన.... వాక్యములోని దోషము తొలగిపోతుంది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Preposition (above—over).

**వివరణ (Explanation) :** మనకు ఉదాహరణలో ఇవ్వబడిన వాక్యమునందు preposition నకు సంబంధించిన దోషము గలదు. ఈ వాక్యములోని సందర్భమును బట్టి "above (పైన, మీద)" అను preposition ను ఉపయోగించుట తప్పు! ఎందుకనగా "above" అనే పదమును నిశ్చల స్థితి (rest) లో తాకకుండా పైన వుండే వస్తువులకు ఉపయోగిస్తారు. "over" అనే పదమును చలన స్థితి (motion) లో, తాకకుండా పైన వుండే వస్తువుల విషయములో ఉపయోగిస్తారు. మనకు ఉదాహరణలో ఇచ్చిన వాక్యమును పరిశీలించిన- The aeroplane was flying above over the city. ఈ వాక్యములో "నగరము మీద విమానము ఎగురుతున్నది" అనే భావము స్ఫురిస్తున్నది. అనగా.... నగరమును తాకకుండా.... నగరము పై భాగములో చలన స్థితిలో విమానము వున్నది. కనుక.... ఇలాంటి సందర్భములో "above" అనే పదము ఉపయోగించకూడదు. "Over" అను పదమును మాత్రమే ఉపయోగించాలి.

ముఖ్యవరాని విషయము :

1] above : ఈ పదమును నిశ్చల స్థితిలో- తాకకుండా.... పైన వుండే వస్తువుల విషయములో ఉపయోగిస్తారు.

2] over : ఈ పదమును చలన స్థితిలో- తాకకుండా....పైన తిరిగే వస్తువుల విషయములో ఉపయోగిస్తారు.

కొన్ని మాదిరి వాక్యములు :

1] (x) : Can you see the aeroplane above the palace ?
(✓) : Can you see the aeroplane *over* the palace ?

2] (×) : The helicopter was flying above the town.
(✓) : The helicopter was flying *over* the town.

3] (×) : The moon is over us.
(✓) : The moon is *above* us.

4] (×) : We flew above the Sahara.
(✓) : We flew *over* the Sahara.

5] (×) : My brother-in-law flew above the clouds.
(✓) : My brother-in-law flew *over* the clouds.

## Example No. : 42

Nervitol is a efficacious tonic. (×)
Nervitol is *an* efficacious tonic. (✓)

సరిదిద్దిన దోషము : పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు Articles నకు సంబంధించిన దోషము గలదు. ఈ వాక్యము నందు "a" అను article నకు బదులుగా.... "an" అను articleను వుంచాలి. ఇందు మనము ఉపయోగించిన Indefinite articles అయిన "a, an" అను రెండు articles నకు భావము ఒక్కటే అయినను.... Usage లో కొంచెము తేడా వుంటుంది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Articles (a, an).

**వివరణ (Explanation) :** పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యమునందు Indefinite articles నకు సంబంధించిన దోషము గలదు. ఈ వాక్యము నందు సందర్భమునుబట్టి 'a' నకు బదులుగా "an" అను article ని ఉపయోగించాలి.

"a, an" అను Indefinite articles ఎలా ఉపయోగించాలి ?

లెక్కించదగిన ఏకవచన నామ వాచకము (Countable singular noun) నకు ముందు "a, an" అను పదములను ఉపయోగిస్తారు. అ

Noun హల్లు ధ్వని (consonant sound) తో ప్రారంభమైనచో.... దాని ముందు "a" అను Indefinite article ను, అచ్చు ధ్వని (Vowel sound)తో ప్రారంభమైనచో....దాని ముందు "an" అను Indefinite article ను ఉపయోగిస్తారు. "a, an" అను రెండు పదములకు అర్థము ఒక్కటే అని గమనించగలరు.

## అచ్చులు, హల్లులను గుర్తించు విధము :

ఆంగ్ల భాషనందు- 5 అచ్చులు గలవు. అవి- "A,E,I,O,U" అనునవి. అచ్చులు తప్ప మిగిలిన అక్షరములను "హల్లులు (Consonants)" అందురు.

అచ్చు (Vowel) లతో ప్రారంభమయ్యేడి పదములు సాధారణముగా అచ్చు ధ్వనినే కలిగివుంటాయి. హల్లులతో ప్రారంభమయ్యేడి పదములు హల్లు ధ్వనినే కలిగి వుంటాయి.

కాని....కొన్ని పదములు అచ్చులతో ప్రారంభమైననూ; హల్లు ధ్వనిని మాత్రమే ఇస్తాయి. అందువలన వీనిముందు 'a' ను వాడాలి.

ఉదా : Useful (Yuseful=యూజ్ఫుల్), University (Yooniversity=యూనివర్శిటి).

మరికొన్ని పదములు- హల్లులతో ప్రారంభమైననూ.... హల్లుఅక్షరము 'Silent' అగుటచేత అచ్చు ధ్వనిని మాత్రమే ఇస్తాయి. ఇలాంటి వాని ముందు "an" అను article ను ఉపయోగించాలి.

ఉదా : hour (అవర్), hotal (ఒటెల్), honour (ఆనర్), heir (ఏర్).

One (wun) "వన్" అను పదము అచ్చుతో ప్రారంభమైననూ.... హల్లు ధ్వనినే ఇస్తున్నది. కాబట్టి దీనిముందు "a" అను article ను ఉపయోగించాలి.

ఉదా॥ : "a one hundred-rupee note (ఎ వన్ హండ్రెడ్ రూపీ నోట్)"

దీనిని బట్టి అచ్చు, హల్లులను గుర్తించవలెనన్న పద ఉచ్చారణ (pronounciation) ను ప్రమాణముగా తీసికోవలెనని తెలియుచున్నది.

**తేలిక పద్ధతి :** ఒక పదము ఏ ధ్వనితో ప్రారంభమౌతుందో తెలిసికోవాలంటే.... ఆ పదమును.... తెలుగులో వ్రాసికోవాలి. పదము యొక్క ప్రారంభములో "అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ" అను అక్షరాలలో ఏదో ఒకటి వస్తే.... అది అచ్చు ధ్వనితో ప్రారంభమైనట్లు! లేకున్న హల్లు ధ్వనితో ప్రారంభమైనట్లు గుర్తించాలి.

**Example - 1 :** Ceylon is an island. (సిలోన్ ఈజ్ ఏన్ ఐలాండ్).

**వివరణ :** పై వాక్యములోని island (ఐలాండ్) అను మాట (పదము) ఏ ధ్వనితో ప్రారంభమైనదో తెలిసికొని, తగు article ను ఉపయోగించాలి. ఈ మాటను తెలుగులో వ్రాసుకుందాము.

ఐలాండ్ : 'ఐ' అచ్చు కాబట్టి.... "island" అను పదము అచ్చు ధ్వనితో ప్రారంభమైనదని తెలియుచున్నది. కాబట్టి దీని ముందు 'An' ను వుంచాలి.

**Example - 2 :** Ceylon is a beautiful island (బ్యూటిఫుల్).

**వివరణ :** పై వాక్యములోని "beautiful (బ్యూటిఫుల్)" అను పదము హల్లు ధ్వనిని కలిగియున్నది. కాబట్టి "a" అను article ను ఉపయోగించితిమి.

**కొన్ని మాదిరి వాక్యములు :**

1] (×) : The explosive nitroglycerine is a ester.
(✓) : The explosive nitroglycerine is *an* ester.

2] (×) : I saw a elephant in the zoological park yesterday.
(✓) : I saw *an* elephant in the zoological park yesterday.

3] (×) : What an beautiful aeroplane it is !
(✓) : What *a* beautiful aeroplane it is !
4] (×) : Switzerland is an European Country.
(✓) : Switzerland is *a* European Country.
5] (×) : My brother is a S.P.
(✓) : My brother is *an* S.P.
6] (×) : A unread Bible usually belongs to a unfed believer.
(✓) : *An* unread Bible usually belongs to *an* unfed believer.

## Example No. : 43

**My friend's brother's wife has studied in this college for four years. (×)**

***The wife of my friend's brother*** **has studied in this college for four years. (✓)**

సరిదిద్దిన దోషము : పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు Noun case నకు సంబంధించిన దోషము గలదు. స్పష్టముగా చెప్పాలంటే.... Noun యొక్క possessive case (షష్టి విభక్తి)కి సంబంధించిన దోష మున్నది. పై వాక్యము నందు "My friend's brother's wife" అను phrase లో - రెండు పదములకు possessive case వున్నది. ఇలా వుండుట తప్పు! దీనిని "The wife of my friend's brother" గా మార్చాలి.

దోషము ఏ భాగమునకు చెందుతుంది? Noun-case (possessive).

**వివరణ (Explanation) :** పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు Noun యొక్క possessive case నకు సంబంధించిన

దోషము గలదు. ఒక phrase నందు గాని లేదా clause నందు గాని రెండు లేదా అంతకన్నా ఎక్కువసార్లు possessive case ను ఉపయోగించుట ఆంగ్ల సంప్రదాయమునకు విరుద్ధము! కనుక....ఒక్క possessive word మాత్రమే వుండేలా జాగ్రత్త పడాలి. సాధారణముగా తొలి పదమునకు మాత్రమే possessive రూపము ('s) ను వుంచాలి. ఎవరి గురించి ప్రధానముగా చెప్పదలచుకున్నామో.... ఆ మాటను ముందుగా వ్రాయాలి. వివరాల కోసము దిగువ పదములను చూడండి !

| నం. తప్పుగా వ్రాసిన మాటలు | సరిదిద్దిన మాటలు |
|---|---|
| 1] My father's sister's son | *The son of My father's sister* |
| 2] Our Mother's brother's daughter | *The daughter of our mother's brother* |
| 3] My brother's friend's mother | *The mother of my brother's friend* |
| 4] My cousin's mother's sister | *The sister of my cousin* |
| 5] My sister's friend's brother | *The brother of my sister's friend* |

గమనిక : పై పట్టిక నందు తెలిపిన విధముగా తప్పులను- సరిదిద్ది, వ్రాయవలెను. రెండు రూపము ('s)లు వాక్యములోని phrase నందు ఉపయోగించరాదు. అందులో ఒక రూపమును తొలగించి, "The——of" అను నిర్మాణమును ఉపయోగించాలి.

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : My wife's sister's son is singing a song.
(√) : The *son of my wife's sister* is singing a song.

2] (×) : Our teache's sister's daughter refused to help me.

(✓) : *The daughter of our teacher's sister* refused to help me.

3] (×) : My friend's sisters teacher dislikes abusing others.

(✓) : *The teacher of my friend's sister* dislikes abusing others.

## Example No. : 44

I lost my luggages at the railway station the day before eysterday. (×)

I lost my *luggage* at the railway station the day before yesterday. (✓)

సరిదిద్దిన దోషము : పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు Noun యొక్క number (వచనము)నకు సంబంధించిన దోషము గలదు. పై వాక్యములో "luggages" అను పదమును luggage గా మార్చిన వాక్యములోని దోషము తొలగించినట్లౌతుంది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది? Noun-number (వచనము)

వివరణ (Explanation) : పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యమునందు Noun యొక్క Number (వచనము)నకు సంబంధించిన దోషము గలదు. luggage, advice, information, furnitureవంటి కొన్ని పదములను Singular number లోనే ఉపయోగించాలి. plural లో ఉపయోగించరాదు. అనగా.... ఆయా పద ముల చివర- s ని చేర్చి, ఉపయోగించరాదు. పాఠకుల సౌకర్యార్థము అలాంటి పదములలో కొన్నింటిని ఈ క్రింద ఇచ్చుట జరిగినది.

| సం. | పదము | ఉపయోగించరాని రూపము |
|---|---|---|
| 1 | poetry (పద్య విభాగము) | poetries. |
| 2] | scenery (దృశ్యము) | sceneries. |
| 3] | stationary (వ్రాత సామాగ్రి) | stationaries. |
| 4] | advice (సలహా) | advices. |
| 5] | furniture (కొయ్య సామగ్రి) | furnitures. |
| 6] | information (సమాచారము) | informations. |

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : The house is full of furnitures.
(√) : The house is full of *furniture.*

2] (×) : The sceneries of the kulu are splendid.
(√) : *The scenery* of the kulu *is* splendid.

3] (×) : I like the poetries of keats and Byron.
(√) ; I like the *poetry* of keats and Byron.

4] (×) : Tennyson wrote fine poetries.
(√) : Tennyson wrote fine *poetry.*

5] (×) : She gave me some stationaries.
(√) : She gave me some stationary.

**XERCISE - 20 :** *Correct the following sentences if necessory :*

1] The furnitures in the house are quite old.

2] They gave me many informations about her character.

3] Her hairs are white.

4] All the new machineries have been in stalled.

5] We need a lot of money for stationaries.

**WORK SHEET :** పై అభ్యాసములోని వాక్యములను- అవసరమైనచో.... సరిచేసి, చిత్తు పుస్తకములో వ్రాసికొని, జవాబులను- ఈ పుస్తకము చివర ఇచ్చిన 'KEY' నందు సరిచూచుకొని, వాక్యమునకు- 1 మార్కు చొప్పున వేసికోండి! Marks : [ ]

# Example No. : 45

**please tell me how solve this problem. (×)**

**please tell me how *to* solve this problem. (✓)**

**సరిదిద్దిన దోషము :** ఈ వాక్యము నందు **Infinite** నకు సంబంధించిన దోషము గలదు. **"Infinitive"** అనేది **verb** నకు సంబంధించిన అంశము!

**దోషము ఏ భాగమునకు చెందుతున్నది ? Infinitive.**

**వివరణ (Explanation) :** పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు **verb** నకు సంబంధించిన **"Infinitive"** అను అంశము నందు దోషము ఇవ్వబడినది. "ఈ సమస్యను ఏ విధముగా పరిష్కరించాలో నాకు చెప్పుము" ఇలా ఇవ్వబడిన వాక్యము నందు **Question words** (ప్రశ్నా పదములు) వచ్చినపుడు వాటి తరువాత **"to-Infinitive"** ను తప్పనిసరిగా తీసుకుంటుంది. పాఠకుల సౌకర్యార్థము ఆ పదములు దిగువ పట్టికలో ఇవ్వబడినవి.

| నం. | పదములు | ఉపయోగించు విధము |
|---|---|---|
| 1] | How (ఎట్లు, ఏ విధముగా) | how to + verb + ——— |
| 2] | Where (ఎక్కడ) | where to + verb + ——— |
| 3] | When (ఎప్పుడు) | when to + verb + ——— |

**కొన్ని మాదిరి వాక్యములు :**

1] (×) : **Do you know how pass the examination ?**

(✓) : **Do you know how *to* pass the examination ?**

2] (×) : I know where go.
(√) : I know where *to* go.

3] (×) : I know where spend the week-end.
(√) : I know where *to* spend the week-end.

4] (×) : He for get when turn.
(√) : He for got when *to* turn.

5] (×) : You must find out where put it.
(√) : You must find out where *to* put it.

6] (×) : He couldn't decide what do next.
(√) : He couldn't decide what *to* do next.

## Example No. : 46

A ship drowned the day before yesterday. (×)

A ship *sank* the day before yesterday. (√)

**సరిదిద్దిన దోషము :** పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు verb నకు సంబంధించిన దోషము గలదు. "drowned" అను పదమును పై వాక్యము నుండి తొలగించి, దాని స్థానములో "sank" అను verb నకు చేర్చిన- వాక్యములోని దోషము తొలగించి నట్లౌతుంది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది? Verb (drowned - sank).

**వివరణ : (Explanation) :** పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు verb నకు సంబంధించిన దోషము గలదు. "మొన్న ఒక ఓడ మునిగిపోయినది" అని ఈ వాక్యమునకు అర్థము చెప్పుకోవచ్చును. ప్రాణములేని వస్తువుల విషయములోను మరియు చెడిపోయిన ఓడ లేదా మర పడవ వంటివి మునిగిపోయినపుడు అవి నీటి అడుగునకు చేరుతాయి. ఇలాంటి సందర్భములో "sink" అను verb ను ఉపయోగించవలెను.

ప్రస్తుతము "sink" అను verb నకు conjugation (క్రియా రూప నిష్పత్తి)ని తెలుసుకుందాము.

| *present tense* | *past tense* | *past participle* | *present participle* |
|---|---|---|---|
| sink (మునుగు, ముంచు) | sank (మునిగెను) | sank (మునిగి), sunken (మునుగుతున్న) | sinking (మునుగుతూ) |

వస్తువులు గాకుండా.... మానవులు మరియు జీవులు నీటిలో ఊపిరాడక మునిగిపోయి మరణించుట సహజముగా జరిగే విషయమే గదా! ఇలాంటి సందర్భములో అనగా.... ప్రాణుల విషయములో "drown" అను verb ను ఉపయోగించవలెను. ఈ పదమునకు కూడా Conjugation ని తెలుసుకుందాము.

**Drown**=మునిగిపోవు, ముంచు; drowned, drowned, drowning ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు past tense ఉపయోగించబడినది. కనుక.... వాక్యమును సరిచేయునపుడు సందర్భమును బట్టి మరల past tense నే ఉపయోగించవలెను. మనము ఉపయోగించిన క్రియల congugation రెండు రకములుగా నున్నదని గమనించవలెను.

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : Do elephants sink easily ?
(✓) : Do elephants *drown* easily ?

2] (×) : He sank the kittens.
(✓) : He *drowned* the kittens.

3] (×) : Wood does not drown in water, it floate ?
(✓) : Wood does not *sink* in water, it floats.

4] (×) : She fell overboard and was sank.
(✓) : She fell overboard was *drowned*.

5] (×) : The ship drowned, went to the bottom.
(√) : The ship *sank*, went to the bottom.

## Example No. : 47

She behaves as if she is a film actress. (×)
She behaves as if she *was* a film actress. (√)

సరిదిద్దిన దోషము : పై ఉదాహరణలోని వాక్యము నందు verb యొక్క tense (కాలము) నకు సంబంధించిన దోషము గలదు. పై వాక్యములో "is" అను present tense (వర్తమాన కాలము) verb గాక....past tense verb ను ఉపయోగించవలెను. అనగా.... 'is' నకు బదులు "was" అను verb ను ఉపయోగించవలెను.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Verb-tense (క్రియ యొక్క కాలము).

వివరణ (Explanation) : పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు- verb (క్రియ) యొక్క tense (కాలము) నకు సంబంధించిన దోషము గలదని తెలుసుకున్నాము. ఈ వాక్యములో present tenseను ఉపయోగించరాదు. కారణము "as If" మరియు "as though" అను phrases ను వాక్యములో ఉపయోగించునపుడు Past tense (భూత కాలము) ను ఉపయోగించవలెను.

గు!ర్తుంచుకోవలసిన విషయము : వాక్యములో "as if (వలే, మాదిరిగా)"; "as through (మాదిరిగా, ఆ విధముగా)" అను phrases ను ఉపయోగించినపుడు తప్పనిసరిగా past tense ను ఉపయోగించవలెను.

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : My friend talks as though he knows everything.

(✓) : My friend talks as though he *knew* everything.

2] (×) : She looks as if she has seen a ghost.

(✓) : She looks as if she *had seen* a ghost.

## Example No. : 48

His two sister-in-laws were angry with me. (×)

His two *sisters-in-law* were angry with me. (✓)

సరిదిద్దిన దోషము : పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు Compound noun అయిన "sister-in-law" అను పదము నకు సంబంధించినది. పై వాక్యములో plural ending అయిన 's' ను law ప్రక్కన గాకుండా sister ప్రక్కన వుంచాలి. ఈ Compound Nonn లో ముఖ్యమైన పదము sister.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Compound noun.

వివరణ (Explanation) : పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు compound noun నకు సంబంధించిన దోషము గలదు. "sister-in-law" అనునది singular number లో నున్న compound noun. దీనిని plural number లోనికి మార్చవలెనన్న - ప్రధానమైన పదమునకు మాత్రమే "-s" అను plural ending ను వుంచాలి. ఈ compound noun లో ముఖ్యమైన పదము sister కాబట్టి....ఈ పదమునకే plural ending ను చేర్చాలి. అప్పుడు "sister" అను పదము "sisters" అవుతుంది.

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : My brother-in-laws congratulated me on my success.

(✓) : My *brother's-in-law* congratulated me on m success.

2] (×) : Patil and Prakash are his father-in-laws.
(✓) : Patil and Prakash ars his *fathers-in-law*.

3] (×) : Gopal and Vinod are her *steps-son*.
(✓) : Gopal and Vinod are her *step-sons*.

# Example No. : 49

My brother shutted his mouth when I cursed him. (×)
My brother *shut* his mouth when I cursed him. (✓)

సరిదిద్దిన దోషము : పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు verb నకు సంబంధించిన దోషము గలదు. ఈ వాక్యములో "shutted" అను పదమును తొలగించి "shut" అను పదము చేర్చ బడినది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? verb.

వివరణ **(Explanation) :** పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు verb యొక్క రూపము తప్పుగా ఉపయోగించబడినది. ఈ వాక్యములో "shutted" అను రూపము ఉపయోగించబడినది. కాని "shut" అను weak verb యొక్క conjugation (క్రియా రూప నిష్పత్తి)లో "ed" అను Past tense రూపము వుండదు. Present, Past, Past participle రూపము "shut" అను verb నకు మారవు. ఒకే విధముగా వుంటాయి. కావున.... past tense లో కూడా "shut" అను పదమునే ఉపయోగించవలెను. అనగా.... ఈ "shut" అను verb యొక్క congugation (రూపము) లో మార్పు వుండదు. ఉదాహరణకు ఇలాంటి కొన్ని weak verbs యొక్క congugation ను- ఈ క్రింద చూడండి !

| | | Past tense | Past participle | Present participle |
|---|---|---|---|---|
| 1] | Bet (పందెము వేయు) | bet | bet | betting |
| 2] | Bid (ఆజ్ఞాపించు, వేలముపాడు) | bid | bid | bidding |
| 3] | Cast (విసరివేయు, పోతపోయు) | cast | cast | casting |
| 4] | Cost (వెలయగు, ఖరీదగు) | cost | cost | costing |
| 5] | Cut (కోయు, తెగు, నఱుకు) | cut | cut | cutting |
| 6] | Hit (కొట్టు, మొత్తు) | hit | hit | hitting |
| 7] | Hurt (గాయపడు, గాయపఱచు) | hurt | hurt | hurting |
| 8] | Let (అనుమతించు) | let | let | letting |
| 9] | Put (పెట్టు, ఉంచు) | put | put | putting |
| 10] | Quit (విడిచిపెట్టు, మాను) | quit | quit | quitting |
| 11] | Read (చదువు) | read | read | reading |
| 12] | Rid (తప్పించు, విడిపించు) | rid | rid | ridding |
| 13] | Set (అమర్చు, అస్తమించు) | set | set | setting |
| 14] | Shed (రాల్చు, కార్చు, చల్లు) | shed | shed | shedding |
| 15] | Shut (మూయు, మూసికొను) | shut | shut | shutting |
| 16] | Slit (కోయు, చీల్చు) | slit | slit | slitting |
| 17] | Split (బ్రద్దలు చేయు, బ్రద్దలగు) | split | split | splitting |
| 18] | Spread (పఱచు, విస్తరించు) | spread | spread | spreading |
| 19] | Thrust (త్రోయు, నొక్కు, పొడుచు) | thrust | thrust | thrusting |

## Example No. : 50

My sister studied a good novel yesterday. (x)
My sister *read* a good novel yesterday. (✓)

**సరిదిద్దిన దోషము :** పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు verb నకు సంబంధించిన దోషము గలదు. ఈ వాక్యములో "studied" అను verb ను తొలగించి, "read" అను verb ను వుంచిన వాక్యములోని దోషము తొలగిపోతుంది.

**దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Verb.**

**వివరణ (Explanation) :** పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు verb నకు సంబంధించిన దోషము గలదు. "study" అను verb ను పరీక్షల నిమిత్తము గాని లేదా దేనికోసమైనా మనస్సులో నాటుకొనునట్లు చదువుకొను సందర్భములో గాని ఉపయోగించవలెను. అలాగాక.... ఊరకనే ఉబుసుపోక కేవలము కాలక్షేపము కొరకు చదివే సందర్భములో- "read" అను verb ను మాత్రమే ఉపయోగించవలెను. అంటే.... చదివి వదలివేసే వాటిని తెలుపుటకు "read" అను verb ను ఉపయోగించవలెను.

## Example No. : 51

She said that she had seen him yesterday. (x)
She said that she had seen him *the previous day*. (✓)

**సరిదిద్దిన దోషము :** ఈ వాక్యములో "yesterday" అను పదమునకు బదులు "the previous day" అను పదము ఉపయోగించి, వాక్యము సరిచేయడమైనది.

**దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Direct & Indirect Narration (Change of adverbials : yesterday- the previous day).**

**వివరణ (Explanation) :** **Direct Speech** (ప్రత్యక్ష సంభాషణము) నందున్న adverbs లేదా దూరమూ, కాలమును సూచించు పదములు Indirect Speech లో తగిన విధముగా మార్పు చెందుతాయి. వివరణల కోసము దిగువ పట్టికను గమనించండి :

| *Direct Speech* | [illegible] |
|---|---|
| **to day** (ఈరోజు, నేడు) | |
| **yesterday** (నిన్న) | |
| **tomorrow** (రేపు) | |
| **the day before yesterday** (మొ | |
| **the day after tomorrow** (ఎల్ల | |
| **last week** (పోయినవారమ | |
| **next year** (వచ్చే సంవత్సరః | |
| **here** (ఇక్కడ) | |
| **these** (ఇవి) | |
| come (వచ్చు) | go (వెళ్ళు) |

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : Nancy said that she had seen him yesterday (నిన్న).

(✓) : Nancy said that she had seen him *before the days,* (క్రితమురోజు).

2] (×) : Raju told his father that he was not going to marry this girl.

(✓) : Raju told his father that he was not going to marry *that* girl.

3] (×) : Madhu says that he is glad to be here this evening.

(✓) : Madhu says that he is glad to be *there that* evening.

4] (×) : She told her uncle that she was starting tomorrow.

(✓) She told her uncle that she was starting *the next day.*

5] (×) : David said that he had been repairing the radio at six last night.

(✓) : David said that he had been repairing the radio at six *the previous night.*

## Example No. : 52

Having finished my work I went home. (×)

Having finished my work, ',' (కామా) I went home. (✓)

సరిదిద్దిన దోషము : ఈ వాక్యములో participle phrase తరువాత 'కామా (,)' వుంచి, తప్పు సరిదిద్దబడినది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Punctuation Marks.

**వివరణ (Explanation)** : ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు రెండు భాగములు గలవు. అవి : 1] Participle phrase :-

Having finished my work. 2] Main clause :-I went home. ఈ రెండు భాగములను వేఱు చేస్తూ.... కామా వుండవలెను. ఈ వాక్యములో ఇచ్చిన participle phrase నందు perfect participle (Having finished) కలదు. "Having" అను పదము perfect word అంటారు.

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : Being late she cannot go to the class.

(✓) : Being late, she cannot go to the class.

2] (×) : Switching off the light she went to bed.

(✓) : Switching off the light, she went to bed.

3] (×) : Having seen her aunt she made a cup of tea for her. 

(✓) : Having seen her aunt, she made a cup of tea for her. 

4] (×) : Having read the book I returned it to the library. 

(✓) : Having read the book, I returned it to the library. 

5] (×) : Hearing a shot the thief ran away.

(✓) : Hearing a shot, the thief ran away.

## Example No. : 53

This letter is written by my father. (×)

This letter *was* written by my father. (✓)

సరిదిద్దిన దోషము : ఈ వాక్యము నందున్న "is written" అను verb ను 'was written' గా మార్చి, సరిదిద్దడమైనది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది ? Voice (Past Indefinite).

వివరణ (Explanation) : పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యమునందు Voiceనకు సంబంధించిన దోషము గలదు. "This letter is written by my father" అని వ్రాయకూడదు. ఈ వాక్యము past event ను తెలుపుతున్నందు వలన verb కూడా past tense లోనే వుండాలి. ఇచట ఇవ్వబడిన Passive Constructionలోని వాక్యము నందున్న verb- 'is written' ను "was written" గా మార్చాలి.

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : Is that picture seen by him yesterday ?
(✓) : *Was* that picture seen by him yesterday ?

2] (×) : America is discovered by Columbus.
(✓) : America *was* discovered by Columbus.

3] (×) : The telephone is invented by Alexander Graham Bell.
(✓) : The telephone *was* invented by Alexander Graham Bell.

4] (×) : A circle is drawn round the hut by Lakshman.
(✓) : A circle *was* drawn round the hut by Lakshman.

5] (×) : The work is completed yesterday by me.
(✓) : The work *was* completed yesterday by me.

## Example No. : 54

We saw many larva on the outside of the leaf. (×)

We saw many *larvae* on the outside of the last. (✓)

సరిదిద్దిన దోషము : పై ఉదాహరణలో "larva" అను పదమునకు బదులు "larvae" అను పదమును ఉపయోగించి, దోషము సరిదిద్దబడినది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది? Noun (number).

వివరణ (Explanation) : పై ఉదాహరణలో ఉపయోగించిన పదము "larva" అనేది ఒక Noun. ఇది singular numberలో ఉన్నది. వాక్యము యొక్క భావమును బట్టి.... ఈ పదము plural number లో వుండాలి. సాధారణముగా ఒక పదము చివర 's' ను గాని, 'es' ను గాని, 'ies'ను చేర్చితే.... అది plural word అవుతుంది. కాని.... ఇది English word కాదు. ఇది Latin Word. అయినను.... English word గానే ఉపయోగిస్తున్నారు. దీనిని plural number లో వ్రాస్తే "larvae" అవుతుంది. దిగువ కొన్ని Foreign plurals ను గమనించండి!

| *Singular* | *plural* | *Singular* | *plural* |
|---|---|---|---|
| larva | larvae | formula | formulae |
| nebula | nebulae | vertebra | vertebrae |

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : There are several oasis in the Sahara Desert.
(✓) : There are several *oases* in the Sahara Desert.

2] (×) : Her four son-in-laws have come to see her.
(✓) : Her four *sons-in-law* have come to see her.

3] (×) : The second innings are very marvellous.
(✓) : The second innings *is* very marvellous

4] (×) : A large number of the cattles were grazing in the field.

(✓) : A large number of the *cattle* were grazing in the field.

5] (×) : The scenerie of kulu valley are very fine to me.

(✓) : The *scenery* of kulu valley is very fine to me.

## Example No. : 55

Gopal is more cleverer than Haneef. (×)

Gopal is cleverer than Haneef. (✓)

సరిదిద్దిన దోషము : వాక్యములో అదనముగా ఉపయోగించబడిన "more" అను పదము తొలగించబడినది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది? Degrees of Comparison.

వివరణ : **(Explanation) :** పై వాక్యములో "more cleverer" అని ఉపయోగించుట దోషము. more ను తొలగించాలి. ఇది Degress of Comparison నకు సంబంధించిన దోషము! Degrees మూడు రకములు. అవి :- 1] Positive degree, 2] Comparative degree, 3] Superlative degree. degrees నందు Adjective లేదా adverb మాత్రమే రూపమును మార్చుకుంటుంది. చిన్న చిన్న పదములుగా నున్న Adjectives లేదా adverbs మాత్రమే వాటి రూపములో మార్పు తెచ్చుకుంటాయి. పెద్ద పెద్ద పదములు మాత్రము Comparative రూపములో "more" అను పదమును, superlative రూపములో "most" అను పదమును గ్రహిస్తాయి. అవగాహన కోసము దిగువ పధములను చూడండి !

| *Positive* రూపము | *Comparative* రూపము | *Superlative* రూపము |
|---|---|---|
| great (గొప్ప) | greater | greatest |
| big (పెద్ద) | bigger | biggest |
| clever (తెలివైన) | cleverer | cleverest |
| fast (వేగముగా) | faster | fastest |
| high (ఎత్తైన) | higher | highest |
| beautiful (అందమైన) | more beautiful | most beautiful |
| precious (ప్రశస్తమైన) | more precious | must precious |
| nutricious (పోషక విలువలు గల) | more nutricious | most nutricious |
| intelligent (తెలివైన) | more intelligent | most intelligent |
| useful (ఉపయుక్తమైన) | more useful | most useful |

కొన్ని మాదిరి వాక్యములు :

1] (×) : Pen is more mighty thans word.
(✓) : Pen is more *mightier* than sword.

2] (×) : The elephant is more big than anyother animal.
(✓) : The elephant is more *bigger* than anyother animal.

3] (×) : Joseph is more clever than David.
(✓) : Joseph is *cleverer* than David.

4] (×) : Mary is beautiful than Margaret.
(✓) : Mary is *more beautiful* than Margaret.

5] (×) : P.T. Usha is more fast than Shiny Abraham.
(✓) : P.T. Usha is *foster* than Shiny Abraham.

## Example No. : 56

He was sent to the prison for three years. (×)
He was sent to prison for three years. (✓)

**సరిదిద్దిన దోషము :** పై ఉదాహరణలో అదనముగా ఉపయోగించబడిన "The" అను 'article' తొలగించబడినది.

దోషము ఏ భాగమునకు చెందుతుంది? Articles.

**వివరణ (Explanation) :** పై ఉదాహరణలో ఇచ్చిన వాక్యము నందు 'prison' నకు ముందు the ని ఉపయోగించరాదు. Prison, college, church, school, hospital, bed మొదలగు Nouns ను primary purpose కొరకు ఉపయోగించునపుడు మాత్రము "the" అను article ను ఉపయోగించరాదు. Secondary purpose కొరకు ఉపయోగించునపుడు మాత్రమే "The" ని ఉపయోగించాలి.

"Primary మరియు secondary purpose అనగానేమి ?" "Prisonను సందర్శించుట primary purpose అవుతుంది. అలాగాక.... శిక్షను అనుభవించుటకే prison కు వెళితే.... అది Secondary purpose అవుతుంది. అనగా.... ఒక పని కొరకు స్థాపించిన సంస్థకు-

అదే పని కొరకు వెళితే.... Secondary purpose అవుతుంది. అలా గాక.... చేసే పని మీద వెళితే.... primary purpose అవుతుంది.

# "KEY (సమాధానములు)"

**Exercise-1** : 1] for, 2] ✓, 3] for, 4] ✓, 5] ✓, 6] for, 7] ✓, 8] ✓, 9] ✓, 10] for (He has been flying........)

**Exercise- 2** : 1] ✓, 2] aren't I ?, 3] ✓, 4] aren't I ?, 5] aren't I ?, 6] ✓.

**Exercise-3** : 1] If I have time. I will come to you. 2] You will get the details, if you see him. 3] ✓. 4] ✓. 5] if I make a promise, I will keep it. 6] You will see a wonderful thing, if you come here. 7] If you drop the cup, it will break. 8] ✓. 9] ✓. 10] What shall I do, if he fails to come ?

**Exercise-4** : 1] saw (have seen), 2] went (have gone), 3] returned (has returned) 4] Wrote (have written, 5] went (have gone), 6] returned (has returned), 7] wrote (has written). 8] received (have received, 9] Visited (has visited, 10] studied (has studied).

**Exercise-5** : 1] are getting, 2] scissors, 3] pincers, 4] My pants were torn, 5] are, 6] cost, 7] that his scissors are very costly, 8] ×, 9] are, 10] Pyjamas.

**Exercise-6** : 1] between, 2] among. 3] among, 4] between, 5] ✓, 6] between, 7] ✓, 8] among 9] ✓, 10] between.

**Exercise-7** : 1] with, 2] with a knife 3] with, 4] by the mob, 5] by his enemy, 6] ✓, 7] ✓, 8] ✓, 9] ✓, 10] by me with a ball pen.

**Exercise-8** : 1] am, 2] were, 3] are, 4] ✓, 5] neither she nor her sisters have come, 6] Neither he nor his father is in the house, 7] ✓, 8]have taken, 9] ✓, 10] ✓

**Exercise-9** : 1] have been waiting, 2] have been living 3] have been discussing, 4] ✓, 5] ✓, 6] has been sleep-

ing, 7] have been working. 8] have been waiting 9] √, 10] √.

**Exercise-10** : 1] teaches, 2] goes, 3] play, 4] √, 5] write, 6] sleeps, 7] reads, 8] understands, 9] gets 10] covers

**Exercise-11** : 1] beside, 2] beside, 3] beside, 4] √, 5] √ 6] beside, 7] Besides, 8] besides, 9] besides, 10] beside.

**Exercise-12** : 1] shall have typed, 2] √, 3] will have left, 4] √, 5] will have destroyed, 6] will have boiled, 7] √, 8] shall have done. 9] he will have taken, 10] √.

**Exercise-13** : 1] The renovation of temple, 2] months leave, 3] arm's length, 4] children's, shouts, 5] My friend's wife, 6] the roof of the building, 7] √, 8] √, 9] √, 10] √.

**Exercise-14** : 1] The Netherlands, 2] Jamaica, 3] Capital city of Sweeden, 4] made in India, 5] Tonga, 6] the United states of America, 7] Angola, 8] Argentina, 9] √, 10] Luxemburg.

**Exercise-15** : 1] √, 2] √, 3] √, 4] with, 5] at, 6] √, 7] to, 8] by, 9] √, 10] √.

**Exercise-16** : 1] One another, 2] √, 3] √, 4] one another, 5] each other.

**Exercise-17** : 1] beautiful than, 2] superior to, 3] senior to, 4] Junior to, 5] inferior to.

**Exercise-18** : 1] have been sweating, 2] has been singing, 3] have been washing, 4] have been making, 5] has been teaching, 6] √, 7] has been showing, 8] √, 9] have been grappling, 10] √.

**Exercise-19** : 1] were, 2] √, 3] were, 4] were, 5] were, 6] were, 7] √, 8] were, 9] √, 10] √.

**Exercise-20** : 1] furniture. 2] information, 3] Hair, 4] mechinary, 5] stationary.

— ★ —